శృంగార గ్రంథమాల—౧.

# శృంగార
# రాధామాధవ సంవాదము

ఎలిదిండ్ల
వేంకటపతి మహాకవి
విరచితము

ప్రకాశకులు:
జి. యస్. శాస్త్రి అండు కో.,
మద్రాసు

సర్వస్వామ్యసంకలితము

ప్రథమముద్రణము

లండన్ రాయల్ యెడిషన్

వెల రు. 2-0-0

చెన్నపురి:

ఆంధ్రపత్రికా ముద్రాలయమున

ముద్రితము—1926.

యము కొంచె మెఱుఁగనగుచున్నది. వ్యాసతాత్పర్య నిర్ణయమున నిట్లు గలదు:

శ్లో. శ్రీవేంకటపతే స్సూను రళఘురే రనుజః కవేః,
అయ్యన్నో వైణికః కుర్వే వ్యాసతాత్పర్య నిర్ణయమ్.

గద్యమ్.—ఇతి శ్రీమద్రామాయణసంవాదాద్యనేక ప్రబంధనిర్మాణధురీణస్య, శ్రీవేంకటపతి కవిసార్వభౌమస్య తనూభవేన, సుభద్రాకల్యాణాద్యనేక ప్రబంధ రచనాచాతురీధౌరేయస్య, అళఘురికవే రనుజేన, వీణావాదనప్రవణేన, వేదాంత సిద్ధాంతరహస్యార్థప్రకాశనధురంధరేణ, శ్రీమదయ్యన్నవిద్వచ్ఛిరోమణినా విరచితే వ్యాసతాత్పర్య నిర్ణయే."

ఈ యయ్యన్నశాస్త్రి తనతండ్రి రామాయణ సంవాదమును బ్రశంసించినాఁడు. ఈతని సోదరుఁడు అళఘురి సుమంతా పరిణయాది ప్రబంధములను రచియించెను. ఆ ప్రబంధము లిప్పు డెఱుఁగరాకున్నవి. వీణావాదనపాండిత్యముచే నీతనికి "వీణ" యని యుపనామము చేరియుండును. శ్రీపర వేంకటేశార్యుఁడు తన గురువని యీతఁ డిట్లు చెప్పుచున్నాఁడు:

శ్లో. యద్వీక్షాఖిలలోకకిల్బిష తమఃకాంతస్య సంపద్ద్యుతిః
సూక్తి ర్యస్య విరక్తిభక్తి భగవద్భోగప్రరోహావనీ;
బ్రహ్మానందసుధాబ్ధిమంథరగిరి ర్యస్యోపదేశక్రమః
తస్మై శ్రీపర వేంకటేశగురవే కుర్వే ప్రణామాయుతమ్.

ఈ శ్రీపరవేంకటేశార్యుఁడు దక్షిణదేశమువారికి నాఁటినుండి నేఁటికిఁగూడ నిత్యపూజ్యుఁడై స్మృతిపథమునను్న మహాని

యుఁడు; మహావిద్వాంసుఁడు. బహుగ్రంథకర్త. పుణ్యపురుష కథాకీర్తనసందర్భమునఁ బ్రసక్తానుప్రసక్తమయిన దచ్చరిత్రము నిక్కడ నించుక ప్రస్తుతించుచున్నాను.

శ్రీధర వేంకటేశార్యుఁడు ఆంధ్ర వైదికబ్రాహ్మణుఁడు. తంజావూరిజిల్లా తిరువిశనల్లూరు గ్రామవాస్తవ్యుఁడు; సంపన్న గృహస్థుఁడు. ఒకప్పు డాయన తండ్రిదో తల్లిదో శ్రాద్ధదిన మయ్యెను. బ్రాహ్మణసమగ్ర మాయెను. గృహమున వంటకము జరుగుచుండెను. తాలింపు పరిమళము ఘ్రాణతర్పణముగా నిరుగుపొరుగులను వ్యాపించుచుండెను. అట్టితరి నీవేంకటేశార్యులకో, యన్యులకో కమ్మగాఁ దగు నొకమాలవాఁడు గోగ్రాసమును గొనివచ్చి యీతాలింపుఁ గమ్మదనపు నాఘ్రాణించి క్షుధార్తుఁడై వేంకటేశార్యులను బిలిచి "బాబూ! కమ్మనివాసనలు నన్నూరించుచున్నవి. మీయింట నేఁడో విందువంటకము లగుచున్నట్లున్నవి. నాకుటుంబమున కింతప్రసాదము పెట్టింపుఁడు. మాకొంపలో నందఱకు నెన్ని దినములగాఁ దిండిలేదు. ఆఁకొంటిమి" అని సూచించెను. ఆయన యదివిని చండాల ఘ్రాణదోషముచే నుచ్ఛిష్టమయినదని యూహించెనో, లేక అన్నార్తుని ముందుగా నాదరించుట మంచిపనియే యెంచె నో కాని యీ శాకపాకాదులన్నింటిని వాని కిచ్చివేసెను. శ్రాద్ధమునకుఁ బునఃపాకప్రయత్నము సేయఁజూచెను. ఊరిలోని దాక్షిణాత్య వైదికులీవిషయము వినిరి. ఆంధ్రుఁడు చెడెనని తెగడిరి. బ్రాహ్మణార్థము రామనిరి. ఊరెల్ల నట్టుడికినట్లుడుకుచుండెను. వేంకటేశార్యులయింట వంటకుఁ దోడువచ్చువారును

## కృతిభర్త

మగడల రామదాసామాత్యుఁడు. కృష్ణామాత్యుని కుమారుఁడు. ఇతఁడు కావేరీపట్టణము పాలించెనట. కావేరీపట్టణము తంజావూరిజిల్లలో గల మాయూరమునకుఁ జేరువనున్నది. చెన్నపురి చెంతఁగల చిల్కాసముద్రమునకుఁ బ్రళయకావేరి యని పేరు గలదట. అక్కడ నేదేని పట్టణమా నాఁడు గలదేమో? కందుకూరి వీరేశలింగం పంతులుగారి కవులచరిత్రమునఁ గృతిపతి నివాసస్థానము "ప్రళయకావేరీపట్టణము" అని వ్రాయఁబడినది. ప్రళయకావేరీ మహాపట్టణ మిప్పుడు తెలియరాకున్నది. ఇందు "శిష్టామాత్య ఫలప్రదప్రణయకావేరీ మహాపట్టణాధ్యక్షా" అని యుండుటచే, 'ప్రణయ' 'ప్రళయ'గా మారినదేమో? కృత్యవతరణిక దొరకనేని కృతిపతివిషయము మెండుగా తెలియఁగనగునేమో?

## కృతిరచనాకాలము

కృతికర్త యగు నారుఁడు అళసూరియను పేరుగలవాఁడు. మధురనాయకులలో నళసూరి ప్రసిద్ధుఁడు. తంజావూరి రాజ్యమును పాలించుచున్న విజయరంగచొక్కనాథునిచే నీతఁడు పంపఁబడెను. కామేశ్వరకవి సత్యభామాసాంత్వన మీతనికే యంకితము. ఈయళసూరి యీ వేంకటపతికవికిఁ గూడ నాశ్రయమై యుండవచ్చును. తత్కృతజ్ఞతాసూచకముగాఁ దనకొమారునకాపేరు పెట్టియుండవచ్చును. అళసూరి క్రీ. 1700 ప్రాంతముల వాఁడు. మనకవియు నాకాలము వాఁడే. శ్రీధర వేంకటేశార్యులకాలమును 1700 ప్రాంతమని తెలియవచ్చుచున్నది.

శ్రీః

# శృంగార

# రాధామాధవ సంవాదము

## ప్రథమాశ్వాసము

శ్రీ రుక్మిణీ మనోహర,
కారుణ్యసుధాసముద్ర, కంసమథన, య
క్రూరాంబరీష సుజనా
క్రూర, చిదానంద, కృష్ణ, గోప, ముకుందా!

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నా రచియింపం
బూనిన రాధామాధవసంవాదం బను మహా
ప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన:

వ. అనవరత ప్రబోధకర
మా మిథిలాపురమందు నొక్కనాఁ
డనఘుఁడు ధన్యుఁడౌ జనకుఁ
డార్యులతో సుఖలీల నుండి సాం

పున సకలావతారముల
పుణ్యకథ ల్వివరింప వింటి నాఁ
జనవున వేఁడెఁ గృష్ణుకథ
సత్యనిధిన్ శుకయోగిరాయనిన్.

క. అడిగిన భక్తితోడఁ బల
కాంక్షితుఁడై నయనాంబుజంబులన్
వెడల ముదంబుధార యదు
వీరునిఁ గృష్ణుని సన్నుతింపఁగాఁ
బడసితి నెంతభాగ్యమని
పద్మదళాక్షుఁ దలంచి మ్రొక్కుచున్
బడలికదీరఁ బాపములు
వాఱఁగఁ భాగ్యము చేర నిట్లనెన్.

సీ. జనకరాజేంద్ర! వినవయ్య సావధాన
మతినిఁ గృష్ణుని చరితము ల్మహిని విందు
మవి రుచింపవు మాకు మాయనుభవంబు
చెలఁగు శృంగారరూపమాఁ జిత్తగింపు.

మ. యమునాతీరమునందు బృందదరి బా
గొప్పల్లె వ్రేపల్లెనా

సమరుల్ గొల్లలపల్లెత జ్జనుల భా
గ్యం బెంతవర్ణింతు మొ
ల్లముగా నందఱుఁ గొల్లలై పుదురు పా
ల న్నేతఁ, దన్నేతమై
యమితానందము నందుఁ నందుఁ దగు
దేవాధీశభోగంబులన్.

సీ. తీరుగాఁ గైసేయు తేరులచందానఁ
పొదుగులతోడ నాఁగఁపు లమరఁ
గనుఁగొనక మదించు గజముల కైవడిఁ
గొమ్ములవృషభము లొప్పారు మిగులఁ
జివ్వకు సటు కాలు ద్రవ్వు వీరుల రీతిఁ
జలపోరి పెనఁగు కోడెలు చెలంగఁ
జెంగున దాఁటు తురంగంబుల వితానఁ
జూపైన లేఁగలు సొంపుమిగుల
నవియె చతురంగబలములై యతిశయిల్ల
మొల్లమై యున్న వ్రేపల్లె నల్లుకొన్న
ఫలితవనములు కోటలై పరిఘవిల్ల
నందుఁ జెలువొందు నందుఁ డానంద మొంది.

క. ఒకపశువుఁ బ్రోచు వానికి
సకల ఫలంబులును గల్గు, సంతతమును గో
ట్లకు మించు పశుగణంబులఁ
బ్రకటంబుగఁ బ్రోచు నందునకు నేమందున్.

గీ. అతని పుణ్యంబనగ, లేక యతనిపుణ్య
పత్నియగు యశోదాదేవి భాగ్యమునగొ,
కృష్ణుఁ డుదయించె వారి కింకేమి తెలుప
జలజనయనుని భక్తవాత్సల్య మహిమ.

చ. చిగురుల పాదము ల్పిక్కటిఁ
బల్కెడువ్రేళ్లు నొప్పారెడి పిక్కలున్
నిగితోడ లందపుఁబిఱుందుఁ
జెన్నగుబొజ్జ వెడందఱొమ్ము శో
భగు కరము లున్నతంగళము
సద్దపుఁ జెక్కులు నవ్యమోము దే
టగు కనుదోయి ముద్దుగురి
యన్ మురియున్ హరి యందు బాలుఁడై.

సీ. పట్టాభియోగ సౌభాగ్యము ల్దిలకించి
నందుండు సంతతానంద మొందఁ

క. వెన్నెలను జలువపుట్టిన
చెన్నునఁ బువ్వులను దావి చెలఁగినరీతిన్
కన్నియ సకలాంగంబులఁ
దన్నుఁగ నొకవింత వాసము వసదినమునకున్.

క. వనిత తనుఁదానె మాచుక
తనలోఁ దా నుస్సురను విరాకై గొనకున్
వనసొగసుకుఁ దనముచ్చట
కనుపైన ప్రియుఁడు లేమి నాఁటకమునకున్.

క. తొల్లి గర్భ మెదిచేసినొ
గొల్లగఁ బసిబాలుఁడైన గోపాలునితోన్
మల్లాడుచు నెల్లప్పుడు
చెల్లాటలు నుండు రాధ చిలిబిలితమిచేన్.

క. బాలుఁడగు శౌరి నెత్తుక
హేలంగతి ముద్దులాడ, నేప్రొద్దు వృథా
కాలక్షేపంబునఁగడుఁ
జాలని నగలేనిబాళి జాల విరాళిన్.

ఉ. భావిగలాభిలాషమున
బాలుని కేమఱు కుగ్గువెట్టుఁ బె

ఁయ్యావులపాలతో జలక
మార్చును దాఁ దొడనుంచి యేమి చూ
చేసని నవ్వుచుఁగా బయఁట
చేఁ దడియొత్తి సిరామరకుంతో
గావునఁ జుక్కఁబొట్టిడు మొ
గంబున సంత ఘటించు నుయ్యాలఁ.

ఉ. నా వెలలేనిమానికము
నా తొలినోముల పెట్టపంట నా
దేవుఁడ నా మనోరథముఁ
దీర్చ జనించిన చక్కనయ్య నా
జీవన జీవనంబ యదు
శేఖర యించుక నిద్రపోగదే
ఓ వెడమాయకాఁడ, యని
యుయ్యాల నూఁచును రాధ మాధవుఁ.

గీ. ఏమఱించి కృష్ణుఁ డిండ్లలోఁ జొరఁబడి
యున్న పాలు పెరుగు వెన్న నేయి
కొల్లలాడుచుండ గోపిక లాకనాఁడు
దొమ్మిగూడి రాధతోడ ననిరి.

# శృంగార రాధామాధవ సంవాదము

క. ఉల్లసయి యున్న వెన్నెల
చల్లిల్లను గొంచుఁబోయి సంగాతులతో
నాట్లాడఁ దొడఁగె మా బ్రతు
కెట్లా కడవెళ్లెనమ్మ, యిట్లా గయినన్.

క. ముద్దిమ్మని బలిమిని మా
ముద్దియ చేనున్న వెన్నముద్దలు గొనె నీ
ముద్దులబాలుఁడు నీ కది
ముద్దయినన్ గొమ్మ, మాకు ముద్దటవమ్మా!

క. బంతులటంచును జెలి చను
బంతులు పిగఁబట్టి లేదు బంతి యటంచున్
గంతులు వైచెను మముఁ గని
కాంతా, పనియేనొ యెంతగలవారలకున్.

క. మందరకుఁ జని పాఁగను మా
ముందగమున నాఁగి నీదుమగఁ డెవఁ డనుచున్
కందువమాటల నడిగెను
అందమె మనజాతి కీర్తి యాఁగడము చెలీ!

క. నీవైన బుద్ధి తెలుపుము
నీవలనను గాకయున్న నేమె యశోదా

దేవికిఁ దెలిపెద ననఁగా
నావేళకుఁ బులిమి పుచ్చి నూరార్చె వడిన్.

క. ముద్దిచ్చును గోపాలుఁడు
వద్దను నడయాడుచున్న వార్తలు విన్నన్
గద్దించును లేదన్నను
బద్దించును జూడకున్నఁ బరితాపించున్.

ఉ. ఓయి మనోహరాంగ, పని
యున్నది పోయెదగాని యిట్లు రా
వోయి మహానుభావ, యని
యూరక పిల్చును; బిల్వ నేమి రా
ధా, యని మాతఁడుం బలుకఁ
దావిని నవ్వును వేగ నిందురా
వోయి, భుజింపఁగా వలద
టోయి, యటంచు వచించు బాలితోన్.

చ. చదువులతోడ నాడఁ బసి
బాలుఁడవా వలదన్న మాన వా
గడములు కొన్ని నేర్చితివి
కల్లరివైతివి కొల్లకాఁడవై

దుడుకులు సేయసాఁగితివి
దొంగిలఁ జొచ్చితి వేమి తెల్పెదన్
నడిగఁ బరాకు చేసికొని
వాకిటికేఁగెదు పిల్వఁ బిల్వఁగన్.

ఉ. బుద్ధులు చెప్పఁబోవుగతిఁ
బొంగుచుఁ గన్నులు పుల్ముకొంచునున్
ప్రొద్దున లేచి యుస్లెఁబడి
పోయెద నమ్మకచెల్లె! యన్నవుఁ
బెద్దవు గొప్ప బవ్వదని
పించెదఁ జక్కనిసామి! రార, నా
ముద్దులకృష్ణ! రార, యటు
మ్రొక్కుచుఁ జేసెను రాధ మాధవుఁ.

ఉ. అల్లుఁడ దొంతపండునల
నాయని వాతెర నానిచ్చు సి
కొల్లవె పుట్టచెండు లివి
గో యని చన్గవఁ బట్టనిచ్చు నా
గిల్లి మయూరపింఛ మడి
గేవని పెన్నెరు లంటనిచ్చుఁ బో

కల్లరి యంచుఁ గృష్ణుఁ డనఁ
గా నగి రాధ యదేమిరా యనున్.

సీ. తిరుగాఁ గస్తూరితిలకంబు దిద్దుచో
గమకించి నెమ్మోముఁ గదియఁ జేర్చు
హారియలుగా గంధంబు మెయినిండఁ బూయ
బరికించి యిక్కువల్ గరఁగ నంటు [చోఁ
మెలపుగా సిగను బూవుల దండఁ జుట్టుచోఁ
బులకించి కుచము వీఁపున ఘటించు
హాయువుగాఁ గై సేసి యద్దంబుఁ జూపుచోఁ
దిలకించి తనమోముఁ జెలియఁ జూపుఁ
జెలఁగి మాటాడఁ బోవుచోఁ జెక్కు గీటు
వలచి వీడెం బొసంగుచోఁ బెదవిఁ గ్రోలు
కదిమి పైఁబడఁ దిగుచుచోఁ గౌఁగిలించుఁ
దమి మనంబున నాఁటి రాధావధూటి.

క. కడి మాడ నేయు భోజన
మిడుఁ బిడికిట నిముడు నలువ లిచ్చును బెడఁగా
తొడవులు దొడుగును బడిబడి
గడగడె కొంకమింతసొగసు గావించు హరిన్.

జూపు వెంబడిఁ దన్నుఁ జూచి సిగ్గున నిల్వఁ
దలయూఁచి కోరికల్ దెలియ నవ్వ
నవ్వువెంబడిఁ బిన్ననాఁటి మచ్చిక లెంచి
నను నయో, దయఁజూడవనుచుఁ బలుకు
బలుకువెంబడిఁ గేలఁ బైఁటకొంగు గెడలించి
నునుజన్ను లాన ఱొమ్మునకుఁ జేర్చఁ
జేర్చి మొనపంటి జిగిమోవిఁ జీరనొక్కఁ
నొక్కి సొక్కించి మరుకేళి స్రుక్కఁజేయఁ
జేసి కనుమాటి యింటికిఁ జేర నరుగు
నరిగి తను గానిరీతిఁ దనంత నుండు.

క. ఆచిన్నెలు సపసవగాఁ
జూచాయఁగ విని చలించి స్రుక్కినరాధన్
జూచి యదేమే రాధా
నాచాయన్ సిగ్గువడెదు నా హరి కనియెన్

సీ. చింత నీవును లేనిచింతతోఁ బవళించి
నిదురవోవుచునుండ నిన్న రేయి
కలలోన నొక్క చక్కనిరాచకొమరుండు
దోఁచె నెవ్వఁ డటంచుఁ దోఁచదాయె

నొకకొంత సేపు తప్పక చూడఁజూడంగ
నీపోలికైయున్న నీవటంచు
"రార కృష్ణా" యని బారతోఁ జేసాఁచ
"నేమి రాధా" యని యెదురుకొనుచు
నెనసి యేమేమొ వింతగా నిపొసర్చె
నంత మేల్కాంచి నినుఁగాంచి యది దలంచి
మురిపెమున నిన్నుఁజూడక మోము వంచు
కొంటి నా సిగ్గు నేమనుకొందునోయి!

మ. అనినన్ బక్కున నవ్వి చిక్కితివి రా
ధా, నాథునే యాచునుం
టిని నీనాథునిమీఁది ప్రేమ విసఁ గిం
టిన్ తుంట విద్దంటవెం
టనె నంటన్నవింటితూపు లెదసం
టన్ తుంట లింకేల నీ
ధ్వనివాచారసభావభావభవగా
థల్ నీవగ ద్దెల్పెడిన్.

క. విరి దాఁచఁ దావి దాఁగునె
పరిపరి పలుకేల నిజము పలికితి వౌనా

ధర వినమె "సత్యవాణీ
సరస్వతీ" యన్నమాటఁ జదువులలోనన్.

క. అనిపల్కు శౌరిపలుకుల
కును మెచ్చుచు నిన్నినాళ్లకును నీపైనన్
మనసెఱిఁగి చిక్కఁ బట్టితి
దనుఁబో యని కృష్ణుతోడఁ దా నిట్లనియెన్.

సీ. కండచక్కెరపానకంబు గావలెనందు
వది గోరవేమిరా యంబుజాక్ష!
రంగు బంగరుబొంగరాలు గావలెనందు
వది గోరవేమిరా మదనజనక!
యిసుక తిన్నెలమీఁద నెక్కఁగావలెనందు
వది గోరవేమిరా మదనరూప!
తోడిబాలురతోడ నాడఁగావలెనందు
వది గోరవేమిరా యమరవంద్య!
తియ్యనైయున్న కెమ్మోవి తేనె వలతొ?
జంటగొనియున్న యలచన్ను లంటవలతొ?
త్రొక్కి కదిసిన పిఱుఁదుల నెక్కవలతొ?
జోడువాయక స్త్రీలతో నాడవలతొ?

గీ. నీకునాఁడె మల్లె నన్న రాత్రిరి గంటి
నమ్మచెల్లి! నిన్ను నమ్మరాదు
నవ్వగాను రేయి నాప్రక్కలో నుండి
కలువరించలేదె చెలులన్ని.

ఉ. అందాల కాసయేని మగ
నాండ్రనయింబడి దూఱునొందఁగా
నెందుకుఁ గంటి కింపయిన
యింతుల నగ్గురిఁ బెండ్లి సేయనో
పొందుగఁ బ్రొద్దుపోకలకుఁ
బూనితి వేనియు మేము నేరమో
చందమవంటి ముచ్చటలు
నాటలు పాటలు నోటిమాటలున్.

కం. చిన్నప్పుడె నెడబాయక
కన్నుల నిన్నెపుడుఁ జూడఁగలిగుండును నేఁ
డున్నంగ నీదుసముఖము
క్రొన్నెల పొడుపయ్యె గగనకుసుమం బయ్యెన్.

చ. అరమర లేక నీకొఱకు
నల్లికబిల్లికగా వసింతుమి

ద్ధరమపు డెవ్వరుఁ గా మనలఁ
దాఁకి తలంచరు నేఁడు వింటివో
మఱి వినలేదొ యీజనుల
మాటలు వాడల నాడనాడ నీ
పసుపులు చూచి నాపయిని
బాపము గట్టి రిఁకేమి చెప్పుదున్.

క. మచ్చరమున నొక రనుకొన
నొచ్చెము నాయందుఁ గలదె యొకనాఁడైనన్
ముచ్చటగా నినుఁ గౌఁగిటఁ
గ్రుచ్చితినో లేని చొరవకుం జొచ్చితినో!

క. నే నిందుకొఱకె నవ్వస
హా నోపుము వట్టినింద లందితి సయ్యో
నైన దిఁకనామె సందుకె
ప్రాణుద మందఱికిఁ గన్నుపొడిచిన రీతిన్.

క. నామనసులోని కోరిక
నీమజనంబులె నిజంబు చేసిరి మనకీ
నేమం బెందుల కీవఱ
కేమాయెను గొడవ లోకు లిటులాడుటచేన్.

సీ. చూపు నేర్చిననాఁడె సొలపుగా మునుమున్న
చేరంగి నను గటాక్షించినావు
నవ్వ నేర్చిననాఁడె ననుపుగాఁ దొలుదొల్త
నాతోడ నగఁగుల్కి నవ్వినావు
పల్క నేర్చిననాఁడె ధారాళముగా ముందు
నత్తత్త రమ్మని పిలిచినావు
నడువ నేర్చిననాఁడె నమ్మికగాఁ దొల్తఁ
వాపరి చేపట్టి కాల్ద్రొక్కినావు
నాఁడు నేఁడని యోచన నేఁడు గల్గె
మరుఁడు పైనబడి నాకింపులు మనమనములు
విను సదాచారనిరతులు విబుధులైన
ఘనులు తారాశశాంకులు గారె మనకు.

చ. అనవిని రామరామ యనుచు
లోపలఁగిఁ జెల్లునె నీకుఁ; గాక నా
మన సరయం దలంచితివో
మక్కువతోఁ గరుణించి నీవు పెం
చిన తను; వింత నీ వగడు
చేసిన కాదనువార లెవ్వరో? ౮౦

దాన కొండిగట్టినన్ పిదప
దోసముగా నటె రాధికామణీ!

క. నీతోడఁ జర్చ సేయఁగఁ
బోతే నామనసు కొకటి పొడమినఁ బాడమున్
నీతోడఁ బలుకవా దింక
వా తప్పితి మొదలు పెడుచువాఁడను నేనున్.

క. అని విఱుగనాడి యాంతనె
తెనసంగడికాస్త్రు పిలువఁ దా నాఁపలుకుల్
విని పోయని యెలుఁ గిచ్చుచు
వనజాక్షుం డరిగె మరల వచ్చెద ననుచున్.

చ. రమణియు సంతెఁ తే దొరకు
రత్నము నాఁచుకపోయినట్టు లోఁ
గుములుచు చేరికిన్ వెలుఁగఁ
గూడక దొంగను దేలుగుట్టు చం
దమునఁ దపించుచు న్నలిన
నాభుఁడు మున్ విడనాడినట్టి వా
క్యములకు సంగతుల్ దలఁచు
గాఁ దలపోయుచుఁ జింత సేయుచున్.

పోయ నునుఁబువ్వు లివివలె
నే యనుఁగవిసంబు దటస్థ నీక నెట్టు లనున్.

ఉ. ఘుల్లుఘ మ్రోయ నందియలు
గజ్జెలు మువ్వలు సందడించఁగా
నల్లని మేనిహా లమరి
నవ్వుమ నల్లన నవ్వు రాఁగ రా
గల్లుచు బారిఁ దగియు
గల్లెడ నేమిర మెల్లమెల్లనే
యల్లుఁడె యద్ధి వియ్యమని
యందుము గాపుగ నవ్వఁ జేమనున్.

క. రారా నందకుమారక,
రారా నవనీతచోర, రారా కృష్ణా,
రారా రాజులయేలిక,
రారా ముద్దులమురారి, రారా శౌరి!

శా. రారా నందకుమార, రార యదువీ
రా, రార రాకాసుధా
ధారాకార మనోహరాంగ, దయలే
దా మైన నాయింటికిన్

మిషిఫల మీాయఁబోవ బలి
మిం గొని తా మొగపంటనొక్కి గ్రొ
క్కారుపరసమూని పీశ్చ్యతు లో
గిం జెలఁగం దలమూఁచిచూచెఁ గే
రిసమును రాధికా మధుర
రాగసుధాకరపీటి సాకెనుఁ.

క. ఆముగ్ధ చూచి రాధిక
యేమతితి నదేమిచూచి తీవన సగి నే
నేమి నిను జూచినట్లెలు
నీమదిఁ దోఁచినది తెలుపు పిదని వేఁడెన్.

చ. పలిపెన రమ్మటంచు సుద
తీమణి దుప్పటికొంగుఁబట్టి లో
పలి పడకింటికిన్ దిగువఁ
బద్మదళాక్షుఁడు మోడిమానిపిం
బలెఁ జని తెల్పుమం చనిన
మంచిది పానుపుఁ జూడుమన్న ని
శ్చలుఁడయి కొంత సేపునకు
జవ్వని దప్పక చూచి యిట్లనున్.

ఉ. మొన్ననె తెల్పలేదటనె

మొన్నటి నిన్నటి పన్నవాంఛ నాం

కొన్నను నీవు భోజనము

గోరియుడెక్కనలె నెత్తి పెంచినా

వెన్నుఁడు లేని మాట లిటు

లేటికి నాడెదు మాటిమాటికిన్

కన్నులఁజూడు మల్లుఁడను

గానటనే యన రాధ యిట్లనున్.

సీ. పసిబాలుఁడందునా, పదికింక నూరిలో

నీవు దూరనియట్టి యిండ్లు లేవు

పగఁ గానందునా, మగఁడు నీవే యని

నీరాకఁ గోరని నెలఁత లేదు.

విననేరవందునా, విద్యల మొరగల్లు

నీ వెఱుంగనిపాటి నీతి లేదు

దయఁజూడవందునా, ప్రియముతో నయముతో

నీవు లాలించని నెలఁత లేదు

యన్నిటను జాణవేయూడు వైన నాదు

కూర్మి నెఱుఁగని దొక్కటే కొదవగాని




నీకు నీయంతఁదోఁచని నెనరుఁ బ్రేమ
వచనరచనలఁ జెప్ప నెవ్వరితరంబు?

ఉ. పెంచినదాననంచు తలఁ
    పంచెదు నాకెరుసారె నీవు ప్రా
పెంచినదాన నేఁడు నిది
    యున్న రహస్యము నారాలి పెల్కులన్
పంచన లేక పాది నిడి
    వారక పోషణచేసి పెంపుగా
పించుట తత్ఫలం బనుభ
    వింపనొ యన్యులపాలునేయనో!

మ. వినరా వాప్రుల కేమి కాముకుల ముక్
    విన్నాము కన్నాములే
నినుఁబోలంగలవాని గాన మవులే
    నీనేర్పు; లోకంబులె
ల్లను గల్పించినధాత భారతికి నే
    లా లోలుఁడై వావిగై
కొనఁ డోఁగా యిటువంటి సామెతలు నీ
    కు న్నాకుఁగా నున్నవే?

ఉ. లేదని కుందినన్ ఫలము
 లేదని దైవము దూరనేల? ని
కే దయరావలెన్ వెనుక
 నీవె తలంచుక చేసికోవలెన్
కాదని పైకొనన్ వసమ
 గాదని నిన్నె నమ్మియుంటి నీ
వే దయలేక నన్నుఁ గడ
 కింతకుఁ బెచ్చుట చేఁ దొఱంగితిన్.

శా. ఓహో! యత్తను గాంచువేని నిత హా
 యుష్మంతుఁ జేసెంట నా
యూహాలోకము సామెతాయె నన నే
 దోక్షంబు గాదందువే
నాహో మంచిది భూమి సామికిని నాలై
 యుండి యత్నోట నం
దేహంబా యిది వేసమాఁజె విసవా?
 నీమాట నీకే తగున్.

ఉ. ఎన్నఁడు పెద్దవాఁడవవు
 డెన్నఁడు జాణతనంబు నేర్తు వీ

వెన్నుఁడు నామసంగతి

యింపుగఁ జేయుదు వంచుఁ గోరి నే

నున్నది వల్లీజనుం

యుల్లముఁ జల్లఁగఁ జేసి మెచ్చుకొం

చు నన్న వింటి వానినని

చూపులు వెట్టుటకా మనోహరా!

ఉ. భూషణభూషితాంగి ఏఱి

ఫుల్ల సరోరుహనేత్ర నీకు సం

తోషము వచ్చినట్లుగ న

నుం దయఁజూతువు గాక మూరకే

దోషమటంచు నన్నతలఁ

ద్రోయకు; వేనిక నూఱ; నీవపు

ర్వేషవిలాసి మేఘము భ

రించెద మత్యుచితవ్రతంబులన్.

క. విను, కాకుండిన వేఱొక

తనువున నినుఁ జెట్టఁబట్టఁ దలఁచెద; నపుడున్

వినవే మొ! వావివరుసలు

తనువుల కర్మంబొ జీవధర్మమొ చెపుమా?

వ. అనిన నబ్బాలికామణికి గోపాలచూడామణి
యిట్లనియె:

ఉ. క్రమ్మక యెన్నికల్కెడవు
కానివి పోనివి గొంపుచేసి వే
దమ్ములు నీతులుం బెగిపు
ధర్మము శాస్త్రములున్ స్మృతుల్ పురా
ణమ్ములు; నీకుఁ జక్కఁగను
నన్ వినువారికిఁ జక్కఁదోఁచని
సమ్మతు లూరివారలకుఁ
జాటన లెంగన నేఁసు ముందుగన్.

ఉ. మంచితనానఁ గాకునఁ
మాటలు నీ కెగిపోతుంమ్యోఁ నే
నంచు భవత్ప్రియంబునకు
నై వినినం గోఅగా దిదేల? నీ
కించుక వల్ల నేమి? యొక
యించుక వావి దలంచుకొమ్మ మ
న్నించుము నన్ను ముచ్చటయు
నేస్తముఁ జాలదె రాధికామణీ!

ఉ. వెంటనె పాపమేల యవి
నేకము గట్టెదు వావిగాదు న
న్నంటకు మన్న అంతులిడీ
యల్లుని మంచితనంబు లేదు పో
మ్మాంటివి; యత్తసేయుపని
కాఱడి లేదనుటే నిజంబు నీ
వంటి యభిజ్ఞురాలి కిటు
వంటివి మంచివౌకో తలంపఁగాన్.

గీ. అనని గాంతలు స్వేచ్ఛావిహార లగుట
తెలిసియేకాదె బ్రహ్మ విధించినాఁడు
మగువ కొక్కఁడె మగవాఁడు మగఁడుగాఁగ
రాధ, యిది ధర్మశాస్త్ర విరోధముగద!

వ. అనిన గోపాలగ్రామణికి రాధికావధూమణి యి
ట్లనియె:

క. మహా దేహసుఖ మెఱుఁగక
తహతహపడి పరసుఖంబుఁ దాఁ గన కిహమున్
సహి పరము స్నేహమైతే
సహజమయామగనిఁగొలువఁజలమోహలమో?

మ. గతి వీక్షించును భిన్ననాఁడు తమనే
 తక్కన్ పెద్ద లొప్పంతు; రె
న్నాతి కెవ్వాఁడు మగండు కాఁడు; మనో
 వాక్కాయకర్మంబులన్
పతి యెవ్వాఁడని తోఁచె నాఁడె పతిగా
 భావించు నాతే పతి
వ్రత; నాకమ్మక మీమాటలం; సమల్రో
 నన్ గోన నేనెట్లైనే?

క. ఒక్కటిగఁ బైన మనో
వాక్కాయములందుఁ జెప్పవారలు ప్రేమల్
ద్రొక్కక ముక్కున నొక్కఁడె
దక్కని దక్కనదిగో పతివ్రత తలఁపన్.

క. మగఁడు మగండని మగువలు
తగవులు నడపెదనుగాక తమ రొల్లనివా
నగుఁగాదని దండించున
తగవున ధర్మాసనమునఁ దగి మగఁ డోహో!

క. నిను నేఁ గాదననేమో
యన వెఱతునుగాని మిగిలినందుల కైతే

విను వారు వీరు నేఁ గా
దనఁగాఁ బనియేమి యొకరికై బ్రతికెదనే?

చ. బుడుతవు నీ వసద్ధాన
ముల్ ప్రచరించెదు బుజ్జగించి నే
నడిగినఁ బాపమం చనెద
వంతకు నీకుఁ బనేమి నీకుఁగా
బడిబడిఁ బాలనాఁడు మఱి
పాలును నుగ్గిడునాఁడు నుగ్గునున్
నడపుచు నేన పెంతునట
నాకు స్వతంత్రము లేకపోయెనే?

చ. పలుకుల కేమి? నేఁపగను
బల్కఁగ నేరవు; నిన్ను మించి యు
క్తులు ప్రచరింప నాతరమె?
తొల్లిటివారల యాడికోలుమా
టలెకద పల్కఁబోయిన నో
డంబడికల్ పనిగావు నాపయిన్
చలమొ ఫలంబొ? యేల కర
సానలఁ బెట్టెదు మాత్రికంబులన్?

ఉ. పాపము పుణ్యమేర్పఱుపఁ
బాల్పడినాఁడవె నీవు; నీకు నీ
పాపము లేల? నీకొఱకుఁ
బైఁబడిఁ దీనత బాధఁ జేసె నా
పాపము; నన్నుఁ గూడఁగల
భామల కబ్బెనుఁ బుణ్య; మిందుపైఁ
బాపముఁ బుణ్యముం గలపె
భావమునం దలపోసి చూడఁగన్.

శా. ఏ నామాటలు ప్రార్థ్యాకృతములుగాఁ
బోనాడి పోనాడి మా
నా నీ మాటలె నిల్పుకొంటి వవి సి
ద్ధాంతంబుగాఁ జేసి; సి
త్రో నింకేటి వితండముల్ పలుక నే
ర్తు న్నేఁటితో నిగ్రహ
స్థానంబైతివి; నీవు చెల్పు పలుకే
శాస్త్రంబు చర్చింపఁగన్.

క. శృంగారకవితవంటిది
యింగనఁ గడుఁ బ్రేమచేత నానందముతో

సంగీకరించినం దగు
భంగంబున కోర్వఁగలదె భావజ్ఞనిధీ!

చ. లలితుఁడ వౌదువంచు మొద
లం జదివించిన పెళ్లి నేఁటికిన్
గలిగెను గాళ్లపైఁబడిన
కామినిఁ గాదని వాడవాడలన్
గల మగనాళ్ల కాళ్లఁబడ
గాఁ జదువున్నదె మాట లేల నన్
సొలపునఁ గూడదా కరుణఁ
జూడర చెల్లని మాల లాడరా!

క. అల్లుఁడ వైనాహూకును
జెల్లగ నుపకార మొకటి చేయుము నాచే
నెల్లఁ గడుఁ గ్రాఁగుచున్నది
చల్లని నీ మేన నొత్తి చల్లార్పు మిఁకన్.

గీ. నన్నుఁ దాఁకినపుడె నామేనికాఁకలు
నిన్ను సోఁకు ననుచు నెన్నవలదు;
నిన్ను సోఁకఁబోదు నిను మున్ను గూడిన
మందసతులతనువులందుఁగాక.

చ. ఇపుడు మదీయవాక్యముల
కీకొనవో యని డెంద మూరకే
తెపతెపఁ గొట్టుకొనెడిఁ బ
డంబడిగా నివె చూడు మంచు స
చ్చపలమృగాక్షి లేచి యల
సారసలోచను కేలుఁదమ్మి సం
దపుటురమందు మోపుకొని
తల్పు బిరాబిర మూసి కృష్ణునిన్.

ఉ. గొబ్బున శయ్యకున్ దిగిచి
గుత్తపుటుబ్బరిపుబ్బ సిబ్బెపుం
గుబ్బ లురంబునం దలమి
క్రుమ్ముచు మెచ్చుచు మోవితేనియల్
జబ్బనఁ జూఱగాఁ గొనుచుఁ
జొక్కుచు ముద్దులుఁ గొల్లలాడుఁ ద
బ్బిబ్బయి కొంతసేపు చెలి
ప్రేమ సదే మనుచున్ సహింపకన్.

గీ. అత్త మల్లాడునప్పు డయ్యంబుజాక్షుఁ
డూరకుండుట సరి పోలకుంట గాదు;

పరవశతచేత నేమియు బదులు నేయ
మనసులోఁ దోఁగొకుండినయునికి గాని.

సీ. మొదలఁ బక్కిటిపిట్ట మొనగి తాఁ గాదేమొ
మంచి దమ్మనుచు నెప్పించుకొనును
తానె గుప్పలరించు నాని దోసము ద్రొబ్బ
మానిని కేలఁ బట్టించుకొనును
పలుమోవి నాటి తప్పాయెను లెమ్మంచుఁ
గెమ్మోవి మరల నొక్కించుకొనును
సరసత్వమై మ్రొక్కి మఱచితి నేఁ బెద్ద
సంగతి మరల మ్రొక్కించుకొనును
ఒకటి చెనగొని శౌరి దానొకటి గోరి
కొమరు ప్రాయపు సన్నెల్లఁ గొల్లలాడి
కిద్దఱును బోసువారలై యుండక మగని
కేమి లంచ మొసంగి లిప్తనో మెఱఁగ వాడు.

సీ. కనుమూయ మల్ చూడ పట్టకొని సీధు నేసంచు
నెనసెం బదమున్నై వాదులాడి
మాయ నెపమై నిచ్చి యటు కేల నేడుక
విరాల బంతులాట ప్రేమలాడి

క్రీడానందసాగరంబున మునుంగుచుం దేలు
చుండె నంత.

చ. తెల తెలవారె వచ్చె నలు
దిక్కులు విచ్చె శుకీపికావళుల్
కలకలఁ గూయఁజొచ్చె మఱికంతుఁడు విల్
రతిచేతి కిచ్చెఁ దేఁ
టుల రొద హెచ్చె జక్కవకు
టుంబము విచ్చె సమీరుఁ డంత శ్రాం
తులకు ముదంబుఁ దెచ్చె మది నొచ్చె
విటీవిటచోరకోటికిన్.

సీ. మినుకుఁజుక్కల గోటి చనకు లేదవి కృష్ణ!
అదిగదా, నీవెలుంగుదువు రాధ!
సొంపుకన్నుల నిద్రమంపు లేదవి కృష్ణ!
అదిగదా, నీవెలుంగుదువు రాధ!
కెంపువాతెరఁ బచ్చికెంపు లేదవి కృష్ణ!
అదిగదా, నీవెలుంగుదువు రాధ!
నునుమేనఁ జిలుగాకు నొక్కు లేదవి కృష్ణ!
అదిగదా నీవెలుంగుదువు రాధ!

నిన్న మొన్నఁటివాఁడవు నేఁడుచూడ
నేడె నేర్చితి వీమాట లీవు కృష్ణ!
నాకు నాశ్చర్యమైనది నీకుఁ జెల్వఁ
గూడె జదిగదా నీ వెఱుంగుదువు రాధ!

క. అని యొండొరు లిటులాడుచు
దినదినముల్ గలసి యొరులు తెలియకయుండన్
కనుమాటి తిరుగుచుందురు
కనఁబడినన్ వారి బొంకు గావింతురొగిన్.

సీ. తనమోవి పంటికొద్దిని జుఱుక్కన నొక్కఁ
గనుకత్తో విదళించుకొని పెనఁగు
పెనఁగినఁ బోనీక బిగికౌఁగిటఁ గదింప
విడు విడు మనుచు నగ్గిడలఁ జూచు
చూపు వెంబడి నొక్కించుక నీవిఁ జేనంట
వదుకు మానవటంచు వెడలఁ బోవు
బోవుచో నొడిసి పట్టఁ, బోకుమంచు దమింప
నొడి పిమ్మట జంట నుండ వెఱచు
వెఱచి వెఱపని తెగువచే వెడల మఱచు
మఱచి మఱపని తెలివిచే మగుడఁ దలఁచుఁ

దలఁచితలఁపని తలఁపునఁ దగులొగొనుచుఁ
బడుచుఁదనమునఁ దిరుగఁ బైఁబడుచు రాధ.

ఉ. కూరిమిఁ గొన్నినాళ్లిటులు
గోపసుతుండు చెలంగుచుండి యా
మేర తలంపులోఁ గదుర
మెల్లనె రాధను నిద్రపుచ్చి వా
ర్వారల కెల్లనుం దెలిపి
రాతిరి వేకువజాము వేళ స
త్క్రూరుని వెంబడిన్ మధుర
కుం జని చేసెక నుండె నయ్యెడన్.

వ. అనిన నవ్వాలిన్మృత్కాంతకాంతుఁ జెప్ప మనుటయు:

శా. పీయూషమాత్రసకలప్రద ప్రశయకా
వేరీమహాపట్టణా
ధ్యాత్మా, శంకరపద్మనాభ రఘునా
థా మాతృగోపాలకా
దిక్షేమంకర సోదరాగ్రజప దా
త్మీయాఢ్య, వాఙ్మంజరీ
సాత్మాన్నందకుమారపాదయుగ పూ
జాలబ్ధభాగ్యోదయా!

క. గంధేభగామినీకుచ
గంధాంకితవక్ష భాగ్యకలిత కటాక్షా,
బంధురహయసింధురజయ
బాంధురసయక్కీర్తి, నందపావనమూర్తీ.

తరల. మధురభాషణా, మంజుభూషణా,
హూస్యసజ్జనపోషణా,
కథితవర్తన, కీర్తినర్తన,
కాంక్షితాచ్యుతకీర్తనా,
ప్రథితలక్షణా, బంధురక్షణా,
భాగ్యదాయకవీక్షణా,
మథితఘోర విపక్షసార వి
మానితస్థిర భాస్కరా!

గద్య. ఇది శ్రీమద్వేణుగోపాల వరప్రసాదలబ్ధ
శృంగారకవిత్వవైభవ వెలిదండ్ల తిరువేంగ
ళార్యతనూభవ విద్వజ్జనవిధేయ,
వేంకట*తినామధేయ ప్రణీతంబైన
రాధామాధవసంవాదం బను
మహాప్రబంధంబునందుఁ
బ్రథమాశ్వాసము.

---

శ్రీః

# శృంగార

# రాధామాధవ సంవాదము

## ద్వితీయాశ్వాసము

శ్రీమత్సమస్త సద్గుణ
ధామా, రామాభిరామ, తాండవకృష్ణ
స్వామిపదాంబుజదాసా,
శ్రీమగదంబారామవాస, చిత్రవిలాసా!

గీ. అవధరింపుము జనకధరాధిపతికి
మదిని సంతోషి మొదవ సన్మౌనితిలకుఁ
హైన శుకయోగి రోమాంచితాంగుఁ డగుచు
నవలికథయెల్ల నిట్లని యానతిచ్చె.

చ. అమరఁగఁ గార్యఖడ్గముల
యందుఁ బరాకయి రాధికామనో

రమణుఁడు కొన్నినాళ్లు మధు
    రాపురిలో విహరించి యంత భ
ద్రముగ సముద్రమధ్యమున
    ద్వారకయన్ పురమున్ ఘటించి రా
జ్యమునకు నాథుఁడై సకల
    సంపద లందుచు నొప్పె నవ్విరిన్.

క. కులమెల్లను రక్షించెను
బలిదంష్ట్రల చెఱలువాపి తాఁ గోపించెన్
భళి! యిట్టిఁ దగదె 'సుపుత్రః
కులదీపక' యనెడుమాట గోవిందునకున్!

తే. ఏటిగవారు చేరిన స
    హించి తనపెంటివారిఁ జేయుచున్
పైనము దాన తల్లియును
    సంస్త్రీయుఁ దానయి ప్రావఁగా జగ
త్పావనమూర్తియా తనకుఁ
    బావనమా తనుఁగన్న దేవకీ
దేవినిఁ దన్నుఁగన్న వసు
    దేవుని నాపదఁబాపి ప్రోచుటల్.

మ. పదిరెండేండ్లగు ప్రాయమందు నిటు గో
పాలుండు భూపాలురన్
మొదలన్ మీఱఁగనీక లోఁగొనుచు రు
క్మిణ్యాదులౌ కన్యలన్
పదియాఱ్వేల వివాహమై సగుణహూ
ష బ్రహ్మమై కన్నవి
న్నదిగా నీమహిమం బటంచు ఘను లె
న్నంగాఁ జెలంగె న్మహిన్.

క. ఈవగ సమస్తభాగ్యము
కైవసమై నిండియుండఁగా సైఁపక యా
గోవిందుఁడు రాత్రిపగలున్
ధ్యానం బిడి కందుఁ గుందుఁ బరవశమొందున్.

క. పోయఁడు వనితలచెంతకు
మూయఁడు సోగడియుమాత్రమును గనుఱెప్పల్
చేయఁడు చక్కఁగ భోజన
మీయఁడు తినఁడును మర్మ మెవ్వారలకున్.

సీ. పెనఁగుచో రుక్మిణి మనువలె నిదామ
సత్తి లేవనిపిల్ల నలుసి నవ్వ

చ. ఒకరికిఁ దెల్పరాదనుచు
 నూరక చింతిలుఁ గొంతసేపు దా
నొకరికిఁ జెల్ప మంచిదని
 యుద్ధవుతోఁ దెలుపంగఁ గోరు నే
నొకరికిఁ దెల్ప రాధ యిటు
 లొక్కరి కేటికిఁ జెల్ప నంచుఁ దాఁ
దకపికలాడుచుండు మదిఁ
 దాలిమి వీడును వేఁడు దైవముల్.

సీ. ఇవ్విధంబున బహుభంగులం బొగులుచు నెందు
ను బ్రద్దవోక యా దేవకీనందనుండు తన ప్రాణ
సఖుండగు నుద్ధవుని కైదండఁ గొని మందమంద
చరణములయి పవమాన కంపితాభంగిభంగనటి
త్కూలక్ష్మాతరసాతకలహంసకారండవ ప్రముఖ
పత్త్రికుల పత్త్రపాతోద్ధూతాంబుజాత జాత
పరాగరాగరసాయితకషాయకాసార రంగ
త్తరంగికణోద్ధూత జలకణ పరంపరాపరితో
షిత మందార మాకంద చందన పిచు
మంద కుంద సిందువార తాల హింతాల
తమాల మాలతీ తక్కోల సాల రసాల జంబూ

బద్ధుఁడఁగాక యుంటిఁగద
    ప్రౌఢత కెల్లను వెల్తిగాఁగ నో
యుద్ధవ, చిన్ననాఁటితగు
    లొక్కటి కగ్గె జగద్విరుద్ధమై.

క. పడుచుఁదనంబున గొల్లల
పడుచులతో నాడు నాఁడు పైనిఁ బ్రక్కన్
బడుచున్ నందుని చెల్లెలిఁ
బడుచున్ గైకొంటి మోహపడుచున్ వేడ్కన్.

గీ. చిన్ననాఁటనుండి ప్రేమ నెందఱితోడఁ
గూడలేదు; కూడి వీడలేదు?
దానిమఱతు ననిన ధైర్యంబురా; దది
రాధ గాదు ధృతివిరోధగాని.

ఉ. తల్లికిఁ దండ్రి కన్నలకుఁ
    దమ్ములకున్ దెలుపంగరాని నా
యుల్లముగుట్టు గోప్య మిపు
    డుద్ధవ! నీకు వచింతు రాధ కే
నల్లుఁడనంచు రాధ మఱి
    యత్త యటంచుఁ బ్రసిద్ధియుండఁగాఁ

జెల్లుగ మాకు నిద్దఱికిఁ
జేరిక యేగతిఁ గల్గుఁ జెప్పుమా!

చ. గమకముతోడ నొక్కపని
గ్రక్కునఁ జేసినచో రహస్యమై
యమరదు మున్నె కొంతగోఱ
మైనది శౌరి స్వతంత్రవాది; వే
దమును మతంబు శాస్త్రమును
దైవము లేదని లోక మెంచు; లో
కమున వివేకి లేఁడు కాఁడు
కాముకధర్మము లూహసేయఁగన్.

ఉ. ఆరును దూఱునుం బడియు
నాచెలి యేమిటి కంటివేని నే
వీరును వారునుంబలెను
వెట్టిదయన్ వలపించ లేదు శృం
గారరసప్రభావములు
కన్నియ నా కుపదేశ మీయఁగా
నేరిచినాఁడ దాని విడ
నేర్తునె? నేర్చిన, దైవ మోర్చునే?

గీ. చక్కఁదనమెల్ల రాసిగాఁ జక్కఁద్రోసి
కమ్మకస్తూరి మేదించి కరఁగఁబోసి
చేసినాఁడేమొ పరమేష్ఠి చేతివాసి
డాసి మెచ్చఁడె చెలిని సన్న్యాసియైన.

గీ. భూమి రామలమోముఁ బోల్కి యనుచుఁ
దామరల నెంతు రే నట్టితామరలనె
చెలియపాదంబులకు సాటి సేయఁగూడ
దందు రాజకరస్పర్శ మందలేమి.

గీ. కలమగర్భంబులఁ దృణంబుగాఁగఁ జూచి
పోలుచు కాహళ లూదకపోవు ననినఁ
బాలఁతిజంఘలతో సాటి పోల్ప నగునె
జనులమఱుఁగున దాఁగెడి దోసలనెందు?

గీ. ఆకృతికి రంభయని కదా లోకరూఢి
యెట్టిరంభలునైన నయ్యిందువదన
తొడల సరిపోలవన్నచోఁ గడమకేమి
యతివ నెంచంగఁ దరమె బ్రహ్మాదులకును?

క. ఉన్నవె సాటువ లెన్నఁగఁ
గన్నియపిఱుఁదంద మింకఁ గౌనందంబుల్

మన్నును మిన్నును గలిగిన
యన్నాళ్లకు మఱవవచ్చునా చెలికాఁడా!

క. ధరఁ గవులు పక్షపాతము
గ రచింతు రదేమొకాని గతులకు సరులా
కరులును, గిరులును సరులా
గురుకుచములు? కెఱుఁగలేరు గుణసామ్యంబుల్.

క. వచియించను రచియించను
బచరించ గణించఁ బాచబాణునితరమా
కచమేచకచకచకరుచి
కుచలికుచమరీచి లికుచకుచకేతగుట్టే.

గీ. క్రోల బుద్ధిగొల్పు కొమ్మవాతెరతోడ
పండియున్న దొండపండు సరియె;
చేరఁడేసికన్నులారసి యిసుమంత
తమ్మిరేకు బనఁగ ధర్మమగునె?

క. కోమలిమోముస కాహిమ
ధాముఁడు సరిగాఁడటన్నఁ దామరసమమా
తామర సమమగు నప్పుడు
తామరసముగాక తన యథాస్థితి నున్నె.

క. ఏయెడ నఖశిఖవర్ణన
సేయంగా నొకరివశమె శేషుఁడు రాధ
పాయక వేణి నెపంబై
వేయేటికిఁ దెలియలేక వ్రేలుచునుండున్.

క. ఆనగుమోమో మూకనుగవ
యానడు మామోవితీరు నాచనుఁగవని
క్కానడక క్కాతొడ త
క్కానీటును మఱవవచ్చునా చెలికాఁడా!

సీ. అల్లుఁడా! రమ్మని యాలరించు నొకవేళ
హాయిలుగాఁ గైసేయు నొక్కవేళ
దుడుకుచేసినను బుద్ధులు దెల్పు నొకవేళ
మక్కువ ముద్దిచ్చు నొక్కవేళ
కన్నెలతో నాడ గద్దించు నొకవేళ
నొంటిగాఁ జదివించు నొక్కవేళ
తచ్చనమాటలఁ దర్కించు నొకవేళ
యూరక నవ్వించు నొక్కవేళ
నొక్కవేళను సైగగామ్రొక్కివేఁడుఁ
నక్కితినటంచుఁ బైఁబడు నొక్కవేళఁ

బెనఁగు నొకవేళ నొకవేళఁ బ్రేమఁ గలియు
నలుగు నొకవేళ నొకవేళ నాదరించు.

క. ఆనాఁటి మనసు మర్మము
లేనెఱుఁగుదు నాదుమర్మ మెఱుఁగును రాధా
మానవతి లోకులెవ్వరుఁ
గానరు మామనసుమర్మకర్మము లరయన్.

చ. తన నునుగోటితాఁకులకుఁ
దాళిన నెవ్వతెపైఁ బరాకు నీ
కని యొక కిన్క దెచ్చుకొని
యవ్వలి మోమయి మోడిసేయఁ గా
దని విదళించినన్ నయిచ
దాయెనె నేఁడని చిన్నవోవు నెం
తని వచియింతుఁ గంచుపద
నాచెలినెమ్మన మెంచ నుద్ధవా!

చ. సిగ నునుగొళ్లు దువ్వుచును
జెక్కిలి నొక్కుచు నేమియో నొకా
నొకకథ చాతురిం దెలుప
నూఁకొన కేను బరాకుగాఁ బకా

పకనగి యేలరా వినవు
పాపఁడ! యింతలో యింతవింత నే
రకమను ముచ్చటల్ మఱవు
రా విఁక రాధిక నెట్లు వాయుదుర్ ?

శా. రారా కృష్ణుఁడ, రాగదోయి వరదా,
రావయ్య గోపాలకా,
యేరా చుంబన మీగదోయి, యధరం
బీవయ్య, నీయాగడం
బేరా, కోప మదేలనోయి, యలిగే
వేమయ్య, మాటాడరా,
'రారా ర', మ్మని పిల్చు; నెట్లు మఱతుర్
రాధావధూటీమణిర్ ?

ఉ. చక్కనిరూపుతోఁ గలికి
జగ్గున నిల్చినయట్లు నిల్చి తా
నిక్కముగాఁగ నన్నుఁ గరు
ణించుచుఁ జూచినయట్లు చూచి తాఁ
బక్కున నవ్వినట్లు నగి
పైకొనఁగా గమకించినట్లు నల్

దిక్కులఁ గానవయ్యెడి మ
దిం దిగులయ్యెడిఁ దెల్పఁబోయినన్.

క. ఆకామినియటు నేనిటు
'కాకఃకాకః పికఃపిక' యటన్న విధం
బై కవఁబాయఁగవలసెఁ బ
రాకా, నావంకఁజూడరా, చెలికాఁడా!

గీ. ఇఁక నశక్తునిరీతిని నేఁదపింప
నొకఁడు కరుణింప నున్నాఁడె యుర్విలోన?
మనము వేకువ వ్రేపల్లెదనుకఁబోవ
వలయు నీవును బైనమై నిలువుమనిన.

క. ఇది మంచిదనుచు నుద్ధవుఁ
డెదఁ బొదలుచు మాట నుబ్బనియ్యక యంతన్
బొదలె, నట రుక్మిణీమణి
యుదుటుంబడుచులమెలుంగులొగివినఁబడఁగన్.

క. మనమాటలు వినరుగదా
యని కొంకుచుఁ గృష్ణుఁ డుద్ధవా, చూచితివే
యినుఁ డస్తమించువైఖరి
మనలంగని డాగఁబోవు మహిమ చెలంగన్.

క. దిగవిడిచి లోకబాంధవ,
తగవే నీవేగ మనకుఁ దా నిదిమేలా
పగలాయె ననుచుఁ బద్మిని
మొగిచిన కేలనఁగఁ బద్మములు ముకుళించెన్.

చ. పొడుచుట యాదిగా దనుజ
పుంజములం దెగటార్చి యార్చి తా
వడిఁ జరమాగ దానవుని
పైబడి నాతపనుండు గ్రుంక వెం
బడిజగమెల్లనున్ బొదువఁ
బైకొనుచీకటిసోఁకుమూఁకచే
నడరుతుపాకితాటికొడి
యగ్గియనన్ బొడసూపెఁ దారకల్.

క. ముడిగొన్నకటికిచీకటి
కెడచూపక దీపకళిక లిండ్లఁ జెలంగెన్
వడిఁ దేంట్ల నంటనీయక
పొడసూపినఁ గనకముకుళములవగ మిగులన్.

వ. అని యివ్విధంబున నవ్వనజనాభుండు గొన్ని
ప్రొద్దుపోకమాట లాడుచుఁ బెండ్లిచవికలోనికిఁ

జని యుద్ధవునిం బనిచి రుక్మిణీకేళికాగృహంబున
కుంబోయి తదనుగుణప్రియభాషణంబుల సం
తోషంబు సేయుచుఁ దనషయనంబునకుఁ దగు
నెపంబు వెదకుచు మనంబున ఘనంబగు పరి
తాపంబునఁ బొరలుచుండె నంత నక్కడ:

క. తను నిదురఁబుచ్చి వేరువ
వనరుహనాభుండు చనిన వార్త చిలుకచే
వెనుకన్ విని యారాధిక
ఘనతరశోకాబ్ధి మునిఁగి కళవళపడుచున్.

సీ. ఒకరిఁ బిల్వఁగఁబోయి యొకరిపేరునఁ బిల్చు
నమ్మచెల్ల! యటంచు హరిఁదలంచు
నొకటిపల్కఁగఁబోయి యొకటి యేమోపల్కు
మోసమాయెనటంచు మోము వంచు
నొకటిఁ జూడఁగఁబోయి యొకటిఁ దప్పకచూచు
తప్పుగా యిదియంచుఁ దనుగణించు
నొకటిసేయఁగఁబోయియొకప్రయత్నము సేయు
మంచిదాన నటంచు మదిఁదలంచు
మారు నిందించు నదె తోఁచె శౌరియంచు
బయలు గబళించుఁ బలవించుఁ బల్కరించు

నిజము గాదంచుఁ గన్నుల నీరునించుఁ
గలకలను ముంచుఁ గలయించుఁ గలవరించు.

గీ. బయలుపడఁజాలదు భయముచేత
నిముడుకొని యుండఁజాలదు భ్రమముచేతఁ
గలికి యప్డు డోదమునఁబడ్డ కరిణికరణిఁ
దొట్రుపడి కొట్టుకాడును ద్రొక్కులాడు.

సీ. మధుకైటభారాతి మధురవాచారీతి
నుండుండి చింతించు నొక్కవేళ
గోపాలకస్వామి రూపుఁ జూడఁగలేమి
నున్నట్లవెదకుఁ దా నొక్కవేళ
హాటకాంబరధారి యదె డాసెనని చేరి
యూరకె బయలాను నొక్కవేళ
పాథోధిశాయిపైఁ బదము పాడఁగఁబోయి
యొంటిగాఁ దలపోయు నొక్కవేళ
దిక్కులేదని విధి దూఱు నొక్కవేళ
మ్రొక్కి దయఁజూడుమని వేఁడు నొక్కవేళ
నోయదూద్వహ! యని చీరు నొక్కవేళఁ
దా మదిఁ గలంగి రాధికాకోమలాంగి.

గీ. మరియు నొకయింత శయ్యపై మఱువులేక
బాధపడి రాధ తడఁబడి బడలి నిల్చి
పిల్చి హాయని తాఁ బ్రలాపించఁదొడఁగె
కృష్ణు నటుగూర్చి చెక్కునఁ గేలుచేర్చి.

క. హాకృష్ణ, హాయదుమాధవా,
హా కేశవ, హాముకుంద, హాగోవిందా,
హాకమలనయన, హాహరి
హాకమలాహృదయలోల, హాగోపాలా!

మ. నిను నాదైవముగా మదిం దలఁతు నీ
నిద్దంపునెమ్మోము నీ
గొనబుంజెక్కులు నీసుధాధరము నీ
గోమైననెమ్మోమునుం
గని యుప్పొంగుచు నాతపఃఫలముగాఁ
గైకొందు నేఁ డయ్యయో!
నను నేలా గెడఁబాయఁజాలితివి కృ
ష్ణా, యెంతనిర్మోహివో!

మ. ఒకనాఁ డించుక చూడకున్న నిను నాఁ
డూరెల్ల నేమేమొ కం

టికి నిస్సారముగాఁగఁ గానఁబడు నా
డెందంబు నిట్లు జూచినం
దుకె ముల్లోకముఁ దాని యేలుగతి నిం
త్రో సంతసంబందు నేఁ
డకటా, యేమియు లేక నీవు ననుఁ గృ
ష్ణా, యింతగాఁ జేయుదే!

ఉ. అక్కట, యెన్నిముచ్చటల
కాసపడుంటి మనంబులోనఁ దా
నొక్కటి యెంచ దైవ మది
యొక్కటి యెంచుట సత్యమాయె; నీ
యక్కునఁ జెక్కుఁ జేర్చుకొన
నైతిని నా కిది మోసమాయె న
న్నిక్కము పాయకుందువని
నిన్నెద నమ్మితిరా మనోహరా!

చ. కదియక సీమవారివలెఁ
గన్నులఁజూచిన వేళఁ గొంత సే
పదియిది ప్రొద్దుపోకల వి
హారము సల్పిన నింతరాదుగా

మొదలనె దూరమొంచవలె
మోసమువచ్చె నీకేమిసేతు నే
మదిమదినుండి యేల నిను
మాలిమిచేసితి జీవితేశ్వరా!

క. ఆసించి నీవుచేసిన
బాసలకే నమ్మియున్న పసిగోల నయో!
దోసమన కింతలో మది
రోసితి వింతటిదయూపకుండవె కృష్ణా!

చ. అని విలపించి నీవు విడ
నాడిన నెవ్వరిగానసంచుఁ గా
మిని మొగమందుఁ జేయిడి
మెల్లనె యేడ్చెను వెక్కి వెక్కి వా
ల్గనుఁగవ వెచ్చనీరు చిఱు
కాలువలై జాఱుకంటి నిర్కుఁ జ
న్గోనలను జాఱఁగా మెయి గ
గుర్పొడువన్ మది తాల్మి వీడఁగన్.

గీ. అంతఁ బెంపుడుచిల్క యయ్యాతివఁ జేరి
యక్క! యిది యేమిచేసెద వళుకుదీరి

చెలులు వినియెద రెందుకే చింతఁ గుంద
వలదు కృష్ణునిపదమాన నిలుపు మనిన.

క. కనువిచ్చి చూచి రాధిక
తను వేఁడెడు చిలుకతోడఁ దానిట్లనియెన్
వినవే చిలుకా! కృష్ణుఁడు
తనునొల్లని వెనుక నాదు తను వేమిటికే?

క. ఇల్లేటికి మగఁడేటికిఁ
దల్లేటికిఁ దండ్రియేల ధనమేటికి నా
యల్లుని రూపముఁ గన్నులు
చల్లనగాఁ జూడఁ గనఁ జాలదె చిలుకా!

చ. కల్లరిగాఁడు లోనెనరు
గల్గినవాఁ డదిగాక వావి మే
నల్లుఁడు రూపవంతుఁడు మ
హాగుణశాలి యటంచు నమ్మి నా
తల్లిని దండ్రినిన్ మగనిఁ
దమ్ముల నన్నల రోసి తన్ను నే
నుల్లములోన దేవుఁడని
యున్నది కీరమ! నీ వెఱుంగవే?

ఉ. వీథులలోన లేనగవు
వెన్నెల చల్లఁగఁగాయఁ బూర్ణచం
ద్రోదయమైనరీతిఁ గళ
లూనినవాని మొగం బెగాదిగ
న్నా దిగులెల్ల దీఱఁ గని
నాదిగదా ఘనభాగ్య మార నా
మీఁదను దేవుఁ డెంత దయ;
మేలు, భళా! యనుకొందుఁ గీరమా!

గీ. చందురునిజూచి సంతోషమందు లీలఁ
జూచి పొంగుదు హరి నదిచూడలేక
యమ్మలక్కలు మిన్నక యాడుకొంగఁ
కేల కొఱమైతి, నిందల నేమిగంటి?

చ. చలమున మచ్చుసల్పిన ని
జాలకునుక్ దయవాఁ డటంచు నే
వలచితిఁ గేతకీ కుసుమ
వాసనలన్ భ్రమఁ జెంది తేనె లో
పలఁ గలదంచు నాసగొని
పైఁబడఁ బుప్పొడి రెండు కన్నులం

దొలికిన లేవలేక పడు
తుమ్మెదతో సరిమైతిఁ గిరమా!

చ. మదిమది నుండలేక బతి
మాలిన నామది నందునో; యదే
కొదవలుగాఁగ నాడుకొను
గుంపులసందునో; యింత కోర్చు నా
బ్రదుకునె యందునో; వెతలఁ
బాల్పడఁజేసిన బ్రహ్మ నందునో;
యదియిదియేల నా వలపు
లాఁటుడిఁ బెట్టిన శౌరినందునో?

ఉ. ఎన్నిటికంచు నే వగతు?
నిప్పుడు నా తలవ్రాఁత యేమి గా
నున్నదొ? యింత అంతుపడ
నోర్చినదానికి నెంత చెందఁగా
నున్నదొ? కాసి పోసి తగు
లూనిన నామది కేమి సేతుఁ? గా
నున్నది కాకపోవదని
యుందునె? యుండదు నెమ్మనం బిఁకన్..

మ. అనుకోరాదని కాక యోచిలుక! నా
కాశౌరి యూరెల్ల హా
యనుకాలంబున నే ఘలం బొసఁగి య
న్యాధీనతం జెంది నేఁ
డనుఁ బ్రార్థించినకొద్దిఁ దా బిగియ పం
తం జింత సంతంత యుం
తసఁగారాని వియోగపాలుపడి లో
నై యుంటి నన్నింటికిన్.

క. నేఁడైన వానిమాసలు
పోఁడిమి విడనాడి నేనుపోలిసెద ననున్
వాఁడి చెడినాఁడు మాయం
జూడ నితని కేల పుప్పొటమ్ములు విల్లున్.

చ. అనుచు ననంగుని గుఱిచి
యంగనలన్ మము నొంపఁగాని పెం
పను గొఱగావు నీయొడలు
భస్మముగా మగవారిఁ జేరను
జెన కఁగలావె లావుగల
చిల్కగుఱాని బిరానఁ జేరి ౧.

గ్గాన బ్రతుకం దలంపు; ఇది
 గో యిఁక నెన్నకు బాటుపాతకముల్.

క. దమయంతి రామునింతిని
భ్రమయించినరీతి పట్టిభ్రాంతిని నన్నుం
దమి ముంచకు పరులెంచకు
కుమిలించకు పుష్పాటమ్మా గుదియించ కెదర్.

గీ. అని యనంగుఁడ వీవు నిన్ననఁగ నేమి
నేమిరీతిని నా వోఁచె నింగి నింపు
నిందుఁ బగ సూపుమని మళ్లి తీవుగాక
కాఁక నను ముంచేసని కలికి యనియె.

సీ. పశ్చిమాచలము పైఁబడి మళ్లి బ్రతుకుదే
 లలిఁ జూపు సింద్రజాలంబుగాక
యిలఁ జకోరములు నెన్నెలఁగ్రోల నెగడుదే
 పగచూపు కిరణౌఘనాశంబుగాక
దినదిన మొకవింత తీరుగాఁ బోతునే
 వెడచూపు బహురూపు విధముగాక
రాహువు మ్రింగఁ గోఁటలు సోఁకి వెడలుదే
 వెత నెడఁజూపు గౌరవముగాక

నల్లనైయున్న జగమెల్లఁ దెల్లఁజేసి
భ్రమలముంతువె కనుకట్టుబలిమిగాక
కాక యేపాటి నిజరీతి ఘనుఁడవైతి
నేఁడుగాదోరి, సెబాసి నీకసారి !

ఉ. ఆగసవింటివాని మది
నల్లుఁడుగా నెఱుఁగ న్మ్రనాప్రు; లో
కాసఁ గుమారుఁడున్ జనకు
కైనది సొంగవ; షేసమామ గం
డాస జనించినాఁడస వి
నంబడెఁ దంత్రీని మించినాఁడు ద్రో
హానకు నింకనైనను మృ
గాంక, మృగాంకునిఁ జేసు మూరకన్.

క. కాడేని నీదువెన్నెల
వేదన నామీఁదఁజూపు విను ప్రాణములన్
లేదనిపించుము పంతము;
లేదా, యల్లునికిఁ దోడు లేలెమ్మ్ము వదిన్.

వ. అని యూ రాధావధూతిలకంబు చిలుకం
జేర్కొని:

చ. ననవిలుకాఁడు భోయ, నెల

నా కలదాయ, యిదేల వీరి బా

ధను బడఁజాల; జాణవుగ

బా చిలుకా, యొకగాథ లేదుగా

యనఁ "విను నన్నుఁ దాఁగి, ప్రతి

యంగ నసంగ నసాంగ నొక్క రా"

జన విని యంతఁ గేళిఁ జెప్ప

పల్లినమూయును; నీశ్వరా, యనుచున్.

క. ఇవ్వగల వాధికామనఁ

నెవ్వగలం బొగిలెఁ జిలుక నేస్తునఁ బలికెన్

జవ్వని, మీగోపాలుని

నవ్వుచు నేఁ దోడితెత్తు నన్నంపవుగా!

గీ. ఆఱునెలలాయెఁ గృష్ణుఁ డం దరిగి యిప్పుడు

నకేయ రాకున్న పిలిచినఁ జాలుఁగాని

భ్రమసెఁ గావునఁ గాక నీపతి మనంబు

కదలకుండున నీచెంతఁ గాంటి నేను.

వ. అనిన విని నవ్వి యవ్విలాసినీతిలకం బిట్లనియె:

చ. వలచినవారు లేరొ; సరి
వారంలో నగుబాటుగాను నా
నలెఁ జరియించరే; యొకరి
వంతున కేటికిఁ బోవ? ధాత నా
తలఁపున వ్రాయఁగా నలెన
దైవము దూరుఁగ నాయుమానా నేఁ
డోలిమెయి నేమినోము లెట్లు
నోఁచితినో యిది గంటి నిమ్మెయిన్.

ఉ. కంటికి నిద్ర రాదు; చెలు
కా, కలకాలము నేఁగఁజాల నీ
వంటియనుంగుఁ గల్గి తగ
వా మగవారలఁ బాసియుంట; నే
నొంటిగ నుండి నిన్ను
నోఁచ; నయో, యిట్లు లేలజాగు? నీ
వెంటనె జంటచేసికొన
నే, నడవే వనమాలిపాలికిన్.

క. నీకుం గలిగిన తక్కులు
నా కమరకపోయెఁగాక నాకబ్బినచోఁ

బైకెగసె యుందిరారమ
ణీకాంతునిఁబొమ్ముమీఁద నిలువనె చిలుకా!

క. పొమ్మనవలె; సన్నిమెడఁ
బొమ్మనవలె; నీవు పోయి పురుషోత్తముతోఁ
రమ్మనవలె, దేహము నీ
సొమ్మనవలె, విడువవలదనుమ్మనవలయున్.

మ. తను భోగింతుఁ, దను స్మరింతు ననుచిం
తం గాచుపో యుంక నా
పని నాకేటికి; సిగ్గులేదె? తొలుతన్
బ్రాయుండి యిల్లాలిఁ గా
పునుగాఁ జేసె తుదిన్ద్యజించి తిరిగే
పుణ్యాత్ములం జూచినం
తనె చాలున్ ఫల; మీశ్వరేచ్ఛ యెట్టులై
నంగాని యామీఁదటన్.

మ. తనపేరుం దనపల్కులుం దనవగల్
తా నాయెడంజేయుమ
న్ననయున్ నెమ్మది నాఁటియున్న దిఁక మా
నంజాలఁ జింతాభరం

బాక డెందంబున కొక్కటుల్ విరసముల్
బుట్టించిపోఁ గాని ర
మ్మన నే యొల్లని వానికేల యితర
వ్యాపారచాతుర్యముల్?

ఉ. ఇంగితమెల్లనుం దెలియ
నెంతయు జాణవు సఖ్య; నీవహ
స్సంగతి నేర్చికొం గలవె?
సన్నుతిగా నది శౌరి చేను ను
ప్పొంగుచుఁ గూడినప్పటికిఁ
బాల్పుగఁ దోఁచును నిన్ను మెచ్చఁగా
బంగరుచిల్క, నిన్ని పుడు
పల్కఁగనేర్పిన చిదపల్కులన్.

గీ. అనుచుఁ దనచేతివ్రాలఁ బద్యములు రెండు
వడిగ లిఖియించి యక్కలనడుమ నిడుచుఁ
జిల్క! నేనేమి దెల్ప; నీచిత్త మింకను
దనదుభాగ్యము పోయిర మ్మనుచుఁ బనుప.

క. గగనమున కెగసి మధురా
నగరముఁ గని యచటఁ గమలనాభుఁడు లేమిన్

ద్దులగారాబుమిటారిచిల్క యన నెం
తో నేగఁ బాదాంబుజం
బులపై వ్రాలఁగఁ గేలిపైఁ దిగిచి యిం
పుల్ గుల్క ముద్దిచ్చి త
క్కులఁ జక్కనైన దువ్వుచు న్నిజపక్షపా
తంబునఁ లాలించుచున్.

క. నందయశోదలు పరమా
నందంబున నున్నవారె? నన్ దలఁచెదరే
యందలి మన వారందఱుఁ?
గొందఱు ననుదూఱుకొంద్రొ కోకినుకమెయిన్.

గీ. పిన్ననాఁటనుండి నన్నుఁ బ్రాణంబుగఁ
బెంచుకొన్న రాధ యెంచునంత
తడవు పీడఁబాలు దెసబాసివచ్చుటఁ
జింత సేయు; నేమివింతగలదు.

క. అని వనజాయతలోచనుఁ
డనవిని యింతంతగాని యానందముతో
నెన రింతలేక యుండినఁ
జనవగునే యనుచు మదిని సంభ్రమమొప్పన్.

ఉ. ఓ సుగుణాభిరామ! పురు
షోత్తమ! దేవరవా రపూర్వసిం
హాసనపట్టభద్రబిరు
దాంక మహోన్నతులై భవత్పద
న్యాస లసత్కిరీట వసు
ధాధిపకన్యక లూడిగంబు లా
సాసలఁ జేయుచుంట గని
నంతకు వింత మఱేమికల్గెడిన్.

ఉ. అన్నియు నుద్ధరించెద న
టంచు నటించిన దానికేమి పో
యె న్నెలకొక్కసారి మొగ
మించుకచూపినఁ జాలు నేల యీ
యెన్నికలంచుఁ గొందఱు ని
జేచ్ఛల దూఱుట దక్క నెవ్వరున్
ని న్నొకపాటివాఁడని గ
ణింతురె, ఓయదువంశభూషణా?

వ. అన్న పలికిన;

క. ఇమ్మాటలు మఱిమఱివిన
ముమ్మరమై తనదుచెవికి ములుకులు గాఁగా
ముమ్మడి నలుమడి కోపము
నెమ్మదిలోఁ బొడమ రుక్మిణీమణి యంతన్.

ఉ. జాఱినకొప్పుతోఁ జెవికి
జాఱినపాపటబొట్టుతో దిగా
జాఱినపైఁటతో నొరగ
జాఱినసివిమతో నొకింతగా
జాఱినసొమ్ముతో జెమట
జాఱినకస్తురిబొట్టుతో ముఖం
జాఱినప్రాణంతో నొడలు
జగ్గుమన న్వడిలేచి దిగ్గునన్.

గీ. లేచి తనయొద్దబోంట్లపై లేచికోఁ
మొంచి గుప్పించి పిలిచి గద్దించుకొనుచు
సైగగాఁ బోవఁ దన కది సైగ గాఁగ
శౌరి ముసిముసినగవుతో నూరకుండె.

గీ. చిలుకకడఁ జూచి నీకేల చిన్నవోవ?
నెంత లేదది; నీకుఁ బనేమి; యొకరి

ప్రకృతిఁ గాదని మాన్పంగ నొకరివశమె?
చెలియ యేమనె నవ్వలఁ దెలుపుమనిన.

చ. చెలియ కిఁకేమి యున్నవి వి
శేషము లయ్యెడ నెన్న మాటికిన్?
దెలుపఁగ వేసటయ్యెఁ జెలి
ఓసత చూచినఁ గృష్ణ కృష్ణ; యా
పాలఁతుక యేమిభాగ్యములు
బాంచెడినో తెలియంగరాదు; వే
డ్కంగనినైన నీదుసము
ఖంబునఁ దెల్పఁగరాదు తద్వ్యథల్.

మ. ఘనయోగీంద్రుఁ నిరీతి నేమి వినినన్,
కందోయిఁ దానేమి గ
న్నను, నమ్మోమున నేమి సోఁకినను గృ
ష్ణా, దేవకీనందనా,
యనిపల్కున్; జెలిప్రేమ నేమనఁగ నా
హా; మోహా మోహాహోహహా, న
మ్మగ నూరార, వికారమందినదిరా
మందారపుష్పాకృతిన్.

క. ఆపడఁతిచేతఁ బెరిఁగిన
పాపంబున నాదుపల్కు ప్రత్యక్షముగా
నోపదయిన నీసేవలు
ప్రాపించుటఁ గొంతకొంత పాటింపఁదగున్.

చ. ఘనకుచపాళి బాళి నినుఁ
గస్తురిచేఁ గొనగోర వ్రాసి యి
య్యనువున నెన్నఁడుందు సక
బా, యనుచున్ దలపోసి పోసి వె
చ్చనికనుపీపు పైఁ బొరిని
జాఱఁ గరంబుల నాని చేఁ జుఱు
క్కున విదళించి యొంత ఘన
మాయెను జీవమటంచుఁ బొత్రిలున్.

* క. ఇక్కమ్మలోన నేమో
గ్రక్కునఁ దా వ్రాసియొసఁగెఁ గైకొనుడనుచున్
తెక్కులు సిమిషిన పత్రిక
ముక్కున నెడలించి శౌరిముంగల నిడియెన్.

[* మక్కువ వెలయఁగ రాధిక
చక్కఁగఁ బసమేను దువ్వి సంభ్రమలీలన్ -అని పా.]

క. పురుషోత్తముఁ డా పత్రిక
నిరుకేల గ్రహించి మొదల నియ్యవటంచున్
మురియుచు నక్కునఁ జేర్చుచుఁ
దఱచుగఁ దలఁపూఁచి చదివెఁ దా నిట్లనుచున్.

చ. సకలగుణాభిరాముఁ డగు
శౌరికి రాధ నమస్కరించి మి
న్నక యొకవిన్నపంబు; నిను
నమ్మిన నన్నియున్ ఫలించె; మ
త్తకు మగఁ డెల్లుఁడంచును వి
తావిత తేరకుఁ జేర వట్టి నా
డిక లివి గోలు నాకు నెగ
డెన్ నడి మాన్యము చేలు నీ కగున్.

వ. అని చదువుకొని తద్భావంబులు పలువెఱంగులం బరికించి వాత్సల్యంబును, ముగ్ధతయును, ప్రౌఢతయును వ్యంగ్యంబునుం దోఁప వింతయుఁ జింతయు దొంతరగా నంతరంగంబునం గదురఁగొంతవడి యూరకుండి యవ్వాలం గనుంగొని యుండు,

† "నిను మది మఱవను......
నను నెనరుమఱచి కినియకునాపై......
కనికర ముంచర......
యని తలంచినపుడె యెనసెద ననరా......"

† ఇది సప్త వతుష్పాప కందము.

అను వాక్యంబులు చదువుకొని యివి గణబద్ధంబులయ్యును బద్యంబు గానివిధం బేమియని యూహించి యస్మన్నామంబు ముందు వెనుకల రచియించి పరిత్యాగలోభంబున మన్నామంబులు వ్రాయక మనంబునం దలంచుకొనుచు కొనియెనని తానె పొసంగించి యవియె నాలుగువిధంబుల సల్లనుచుం జదివె.

క. కృష్ణా, నినుమది మఱవను
కృష్ణా, నను నెనరుమఱచి కినియకు నాపై
కృష్ణా, కనికరముంచర
కృష్ణా, యని తలచినపుడె యెనసెద ననరా!

క. కృష్ణా, కనికరముంచర
కృష్ణా, యని తలంచినపుడె యెనసెద ననరా

కృష్ణా, నిను మదిమఱవను
కృష్ణా, నను నెనరు మఱచి కినియకు నాపై!

క. నిను మదిమఱవనుఁ గృష్ణా!
నను నెనరుమఱచి కినియకు నాపైఁ గృష్ణా!
కనికర ముంచర కృష్ణా
యని తలఁచినపుడె యెనసెద ననరా, కృష్ణా!

క. కనికర ముంచర కృష్ణా,
యని తలఁచినపుడె యెనసెద ననరా కృష్ణా,
నిను మదిమఱవను కృష్ణా
నను నెనరు మఱచి కినియకు నాపైఁ గృష్ణా.

క. అని రచనఁ బొగడి కృష్ణుఁడు
మనమున సంతోషమంది మక్కువఁ బలుకన్
కనుఁగొని గ్రక్కునఁ జను మిఁక
ననువుగ నే తేపెవత్తు నని తెల్పవలెన్.

గీ. మొదలఁ బదివేల నేరముల్ మోచియున్న
నేను నేఁడింక నేమన్న నిక్కమగునె?
రాధతోఁ దెల్పు మొకమాట 'రమణి తేపె
నీదుపదమాన వచ్చెద, నిజ;' మటంచు.

† "నిను మది మఱవను......
నను నెనరుమఱచి కినియకునాపై......
కనికర ముంచర......
యని తలంచినపుడె యెనసెద ననరా......"

† ఇది సప్త స్వరస్థాపకంపము.

అను వాక్యములు పొదువుకొని యివి గణబద్ధములయ్యును బద్ధములు గానివిధం బేమియని సమూహించి యక్షరమ్ములు ముందు వెనుకలు రచియించి పరిత్యాగలోధములను మన్నామములు వ్రాయక మనంబునం దలంచుకొనుచు కొనియెనని తాను పాడిగించి యవియె నాలుగువిధంబుల నిట్లనుచుం జదివె.

క. కృష్ణా, నినుమది మఱవను
కృష్ణా, నను నెనరుమఱచి కినియకు నాపై
కృష్ణా, కనికరమునుంచర
కృష్ణా, యని తలచినపుడె యెనసెద ననరా!

క. కృష్ణా, కనికరమునుంచరి
కృష్ణా, యని తలచినపుడె యెనసెద ననరా

కృష్ణా, నిను మదిమఱవను
కృష్ణా, నను నెనరు మఱచి కినియకు నాపై!

క. నిను మదిమఱవనుఁ గృష్ణా!
నను నెనరుమఱచి కినియకు నాపైఁ గృష్ణా!
కనికర ముంచర కృష్ణా
యని తలఁచినపుడె యెనసెద ననరా, కృష్ణా!

క. కనికర ముంచర కృష్ణా,
యని తలఁచినపుడె యెనసెద ననరా కృష్ణా,
నిను మదిమఱవను కృష్ణా
నను నెనరు మఱచి కినియకు నాపైఁ గృష్ణా.

క. అని రచనఁ బొగడి కృష్ణుఁడు
మనమున సంతోషమంది మక్కువఁ బలుకన్
కనుఁగొని గ్రక్కునఁ జను మిఁక
ననువుగ నే జేపెవత్తు నని తెల్పవలెన్.

గీ. మొదలఁ బదివేలనేరముల్ మోచియున్న
నేను నేఁడింక నేమన్న నిక్కమగునె?
బాధతోఁ జెల్పు మొకమాట 'రమణి జేపె
నీదుపదమాన వచ్చెద, నిజ;' మటంచు.

క. అని మారుకమ్మ యొసఁగిన
వినయంబునఁ గొని శుకంబు వినువీథి వడిఁ
జనుదెంచెను వ్రేపల్లెకు
మునుపటి తనపతిపాశమును గనుపించెన్.

గీ. వచ్చుచిలుకఁ జూచి వనిత దగ్గిన లేచి
బార సాచి కౌఁగిలించి గారవించి
పోయినట్టిదినములు కారయెను నెంతో యన్న
పండు పండు తేపు నెంచుగనిన.

క. ఇంత మొగ మంతచేసుక
యంతింతనరాని విస్తులానందసుఖముఁ
గొంతవడి మూరకుండి తా
నంతనె రాచిల్కఁ జూచి యనఁగా నిట్లెన్.

ఉ. కంటివె కన్నులార నన
కంతునిరూపము; వీనులారఁగా
వింటివె వానిమాట; యాంక
వెంబడినైన నన్నుఁ దలంచెనే?
అంటివె కృష్ణకృష్ణ యని
హా శుకమా, పొడగంటి నీవు మా

వంటి యదృష్టహీనుండు
వానిం గనుంగొను భాగ్య మబ్బునే?

క. ఉన్నాఁడా గోపాలుఁడు?
విన్నాఁడా నీసుమాటు? వేడుక నచ్చె
న్నన్నాఁడా సందేశము?
మన్నాఁడా స్నేహమైన మనుకు,—సకియోడా?

ఉ. ఏమనె, నేమిపల్కె, నిను
నేమని పంపెను, నన్ను గూరెనో,
ఏమనెనో, పరాకిడెనో,
రాజును గేలిక కృష్ణమూర్తి నా
స్వామి ముకుందుఁ డచ్యుతుఁడు
వారిజనాభుఁడు శేషశాయి న
న్నేమనె, నేమిచెప్పుమనె,
నేమని పంపెను, నిన్ను నేమనెన్?

క. అదియుండె నేను పంపిన
పదపద్యమ్ము లెల్లఁ జదివి భావముఁగనెనా
బదులేమి పంపెఁ జెప్పుమి [చెలీ.
పొదలుచు నాలేఖఁ గొనుచుఁ బొలఁతుక నగు

క. పత్రికల వ్రాయుజాణకుఁ
బత్రికలన్ వ్రాయుటేమి ప్రౌఢిమ యనుచున్
పత్రికఁ జనుగవపై నిడి
పత్రార్థము సొమ్ము దెమ్ము పత్రిక యనుచున్.

గీ. చిలుకతోడఁ గొంత సేపు మాటాడుచు
మొదలుకొనిన చోటె మొదలుగాఁగ
నాల్గుచరణములును నాలుగు విధములై
తనరు పద్య మిట్టు లనుచుఁ జదివె.

క. తలఁచినఁ గలసెద రాధా!
తలపడు మరుశరములకును దలఁకకు రాధా!
నెల నికఁ దలఁపకు రాధా!
కలచిలుకల పలుకులకును గలఁగకు రాధా!

వ. అని యిట్లు చదువుకొని తచ్చాతుర్యంబునకు
మెచ్చుచు నీపాటికటాక్షంబు నాపై నున్నదే
యశోదాగర్భరత్నాకర రాకాసుధాకరునకని
తన పెంపుడుచిలుకను ప్రియంబుదొలుక దువ్వు
చు నీవల్ల నుల్లంభిపాటి చల్లఁదనంబునఁ నుల్లి
సిల్లెశుకకులరత్నాకర రాకాసుధాకరా, ద్వార

కాపురం బేకరణినుండె; నందలి వింత లేచందం
బుననుండె; నందు గోవిందుం డేయందంబునఁ
గొలువైయుండె; నంతయుఁ దెలియఁబలుక
వలయు ననిన రాధికావధూతిలకంబునకు
ముద్దుచిలుక యిట్లనియె:

సీ. అష్టదిక్పరి చుంబితా భ్రంకషవిచిత్ర
గోపురం బలద్వారకాపురంబు
మహిత ఘటాంభోజాతమణిమయ మహనీయ
నూపురం బలద్వారకాపురంబు
సకలవైభవభోగ సరణీ విరాజిత
గోపురం బలద్వారకాపురంబు
కమలాంబకునిఁ గన్న కమలాలయకు నుండఁ
గాపురం బలద్వారకాపురంబు
నీల పద్మ మహాపద్మ నిరుపమాన
విజయ కర శంఖ వరకుంద వినుత మకర
కచ్ఛపముకుంద శోభిత ఘనలసదల
కాపురంబగు నల ద్వారకాపురంబు.

బడుపని యూహుకొందు రచి
పట్టరు ద్వారకలోనివార లె
క్కడిమతమంచుఁ దూఁగుపుట
గట్టను దోఁచుచుఁ గోటమెక్కి యా
పడుమటగట్ట బ్రావాలు నోక
బాలునిగాఁ గనుగొందు రయ్యెడన్.

గీ. మేటినాకంబె యిప్పుగను గోటపాడవ
గడ్డఁ గలలోఁతు నాగలోకంబె యిందు
దీనిలోఁ దారతమ్యంబు వెలియరాదు
దానఁ బ్రథమాత్మతీయ భేదములు దక్క.

సీ. ఆచారవంతులో నచటివిప్రోత్తముల్
వావిదప్పిన బహ్మ వార్త నగుదు
రపజయంబెఱుఁగని యచటి రాచకొమాళ్లు
రణమున వెనుకయూరాము నగుదు
రందఱుఁ బోషించు నచటి కోమటు లాది
భిక్షుకు రోయు కుబేరు నగుదు
రధికధాన్యసమృద్ధి నచటి శూద్రులు తన
హాలము వ్యర్థమటంచు బలుని నగుదు

రచటి తేరులు మేరువునైన నవ్వు
నచటి గజములు శక్రుని గజము నవ్వు
నచటి హయములు పవమానునైన నవ్వు
నచటి భటకోటి నిష్కాములైన నవ్వు.

చ. ఘలుఘలు ఘల్లుఘల్లు ఘలు
ఘల్లనుగంటలు చాలుకాలిపోన్
గొలుసుల మందపున్నడలు
కుల్కులహుంకరణంబు లోరచూ
పులవిడఁబాటు లారజపుఁ
బూనిక లానికలున్ మదోద్ధతుల్
దలఁపఁగ గంధసింధురము
లాయనఁ బెల్లుగను వారకామినుల్.

క. వడి గలిగి మృదపదంబుల
పడవడిచే మిగిలి యానసన్ సాదృంకె
క్కుడు వగఁ జొప్పగుఁ దగునడ
గడునలవడఁ దురగవితతి గవిత[గరిత]ననంగన్.

ఉ. అంగననీవు పువ్వులుఁగ
లాపెవె; యూ, మగవారు లేరు; లే

కంగడిదేరినావె వళు
    కా, వెలకుం గొనుమోవి తేనె బం
తిం గొనకుండ దాంతు పది
    తేరకుఁజూపుదురా విటుండ, కొ
న్నంగడి మారుబేరములె
    యంచు వచింతురు పుష్పలావికల్.

గీ. అట్టిపట్టణమెల్ల నేకాధిపత్య
ముగ భరించుచున్నాఁడు నీమగఁడు నేడు
రేపె పట్టపుదేవి గానోపు దీవు
మమ్ము జేరితిఁ బ్రోతువా మఱపు లేక.

ఉ. మేడలఁబారు మేడల న
    నేకము చూచితి నాఁడు మేడ లా
మేడలలోన నొక్కమగ
    మేడ భవత్పతికొల్వుమేడ యా
మేడకుఁ దూర్పుప్రక్క నొక
    మేడ చెలంగఁగ శౌరిఁజూచి యి
మ్మేడకు నెవ్వ రాథ్యులన
    మీపువుఁబోఁడనిపల్కె నవ్వుచున్.

గీ. మగువ మగరాలచవికె నీమగఁడు నేను
నీప్రసంగములాడ నానీడపార
నచట నొకచిల్క ననుఁ జూచి నట్టులుండ,
నవల నెవరన, నెవరు లేదనియె శౌరి.

చ. ఇటు ననుఁ బంపినాఁడు మునుపట
నే నటుపోయి నక్రొత్తవాఁ దప్పు చీ
కటి నడిమిద్దెటింప్లఁబడి
కాంతమణుల్ బయలంచు భ్రాంతిచే
నట నెగఁ బ్రాఁకి తాకి తల
వాచుచు గూఁపుల వెంట దూరి యె
ప్పటి హారిముంగలంబడి కృ
షణ్ గడవెళ్లితిఁ ద్రోవ చూపఁగన్.

మ. ఒకకీల్గోపురమందు వింత గనుగో
నూహించి యూపైన నిం
చుక కాలూనిన గిఱ్ఱున దిరుగ న
చ్చోఁ బోవరాదంచు బ
ద్ధికిఁ దోఁచెన్ మరియొక్క వింత విను మా
తీరంబునం దొక్కబా

మ్మ కరంబెత్తె నిజాలకున్ బకంతిగా
మల్లాడుచు న్నవ్వితిన్.

ఉ. గోలతనంపుఁ జిల్కయని
కోమలి నవ్వకు నీకు ముందుగా
బేలవు గాకతెన్ను దాక
పెద్దహజారముఁ గన్న వీఁడు గో
పాలుఁడు వీఁడు కృష్ణుఁడను
భ్రాంతిని కత్తిరు మ్మలెల్లనా
పోలిక నున్నఁ బైఁబడఁగఁ
బోసెడఁ దాళుము రేపె చూచెదన్.

క. సైచుమనిపలుక రాధిక
యోచిలుకా యింతగోల యుడికించెదవే
నీచిత్తము నాభాగ్యం
బాచతురుం డెప్పుడువచ్చు నని పలుకునెడన్.

గీ. కొంద రాభీరపూర్ణ రాకేందుముఖులు
నగుచు నేమక్క, విన్ననైనావు నీవు
మాటలేమనె మరియేటిమాటలనుచు
నొకటిపైఁ బెట్టు నిదె మాటకొకటియుండ.

వ. అనిన నవ్వాలివృత్తాంతంబు చెప్పమనుటయు.

ఉ. సింధుగభీర, శీతకర
      శేఖర జూటనటద్ద్వయస్సదీ
   బంధురశీకరప్రకర
      భాసురసత్కవితాధురంధరా,
   సింధురగామినీనఖర
      చిత్రవిభూషణభూషితోజ్జ్వల
   త్కంధర, నీతినూతనయు
      గంధర, బంధుమయూరకంధరా!

క. ఖరనఖరశిఖరముఖరిత
   వరరవవీణాప్రవీణ, వాణీరమణీ
   శ్వరనారదహారపారద
   శరకీర్తివిహార, కృష్ణసచివకుమారా!

మాలినీవృత్తము:

   సులభనవమనోజా, సూర్యసంకాశతేజా,
   ఫలితహరిసుపూజా, బంధుమందారభూజా,
   కలితసుకవిభోజా, కాంతసత్కాంతిరాజా,
   లలితహితసమాజా, లక్ష్మమాంబాతనూజా!

గద్య. ఇది శ్రీమద్వేణుగోపాల వరప్రసాదలబ్ధ
శృంగారకవిత్వవైభవ వెలిదిండ్ల తిరు
వేంగళార్యతనూభవ విద్వజ్జనవిధేయ
వేంకటపతినామధేయ ప్రణీతంబైన
రాధామాధవసంవాదం బను
మహాప్రబంధంబునందు
ద్వితీయాశ్వాసము.

---

శ్రీః

# శృంగార

# రాధామాధవ సంవాదము

తృతీయాశ్వాసము

---

శ్రీ కరవరవైభవని
త్యా, కమలానాథమనోహరదాంబుజభృత్యా,
ఆకార విజితనాస
త్యా, కృష్ణాంశ్య, రామదాసామాత్యా!

గీ. అవధరింపుము జనకజారాధ్యపతిక
మదిని సంతోష మొనవ సన్మునితిలకుఁ
డైన శుకయోగి రోమాంచితాంగుఁ డగుచు
నవలి కథ యెల్ల విస్తరి మానసించె.

ఉ. అప్పుడు కృష్ణదేవుఁడు ద
యాంబుధి గాపునఁ గావుమన్న వో

గుహ్వన నా గజేంద్రాకడ
కుం జను వెంచినరీతి వచ్చెం దా
నెప్పటి గొల్లలు లెకుం గ
వీంద్రులు గాయకులుఙ్ సఖుల్ భటుల్
తప్పక వెంటరా రథము
దారుకు డింగిత మెంచి తోలం గఙ్.

గీ. మునుపు దానున్న కేతులు మొదటి నడత
లక్కడక్కడ సఖులంతో నాడుకొనుచుం
గనుచు నట గొల్ల లెవ్వరో యనుచు బ్రమయ
నడచి కృష్ణుండు నందుని నగరుచేరి.

క. బడలితిరి మీార; లిప్పుడు
విడిదింట్లకుం బొండు; మిమ్ము వెనుకం బిలిచెదఙ్;
దడసితిరి భోజనానికిం
దడయక నేదలను దేరం దగు మీారు వడిఙ్.

చ. అనిపలుకుల్ వినంబడిన
నంతం బడంతులు చే నదల్చుచుం
గనుబొమ నిక్క నంబరముం
గన్గొనుచుం జెవి వ్రాల్చి కొంత నే

పున కిది శౌరిపల్కు-బడి
పో వినఁగ గ్గెనె యంచుఁ దత్తరం
బును దమకంబుఁ దాల్చి భయ
మ్మున్ ముదమ్మున్ మదిలోఁ బెనంగఁగన్.

క. బిరబిరను సెజ్జమీఁదికి
నరిగి గవాక్షముఁ జూచి హరి యానుచుం
బరికింప రాధికామణి
మఱియేమియుఁదోఁచకపుడు మ్రాన్పడియుండెన్.

వ. అంత;

సీ. వచ్చినా మాతండ్రి వాసుదేవుం డని
నందుండు వచ్చె నానందమునను
నాచిన్నివాఁడనిఁ జూచితినా యని
సొంపునఁజేరె యశోద ప్రేమ
మన నేస్తకాఁడు వచ్చెనటంచుగోపాలు
గుమిగూడి మూఁగిరి గొల్లలెల్ల
నేఁడైన దయగల్గెనే యంచుగోపిక
ల్వొరుగిండ్లనుండి చూచిరి కడంగి

చెలఁగి కృష్ణుండు దుప్పటి మొల బిగించి
తల్లిదండ్రుల పాదపద్మముల కెరఁగె
వారు దీవించి కౌఁగిట గారవించి
రపుడు వారల భాగ్య మెంతని నుతింప.

ఉ. నందకుమారు డంతఁ జిఱు
నవ్వుమొగంబునఁ దేటకన్నులన్
బొందుగజాఱు ప్రాలసిగ
పొంకమునన్ వల పప్పళించు మై
గందపుఁబూఁతచే నలుపు
గప్పడ కొక్కవిలాసమూర్తి విం
తందము మించినట్లు కన
నయ్యె నెగాదిగఁ జూచువారికిన్.

మ. అచటం జల్లఁగఁ దల్లిదండ్రులమనం
బానందముం జెందఁ బ
ల్కుచు గోపాలుర బుజ్జగించి నలు ది
క్కుల్ సూచి తన్ జేరఁ గో
రు చనున్నట్టి వ్రజాంగనామణుల కో
ర్కుల్ చూపులన్ బ్రీతిఁ జొ

న్పుచు వారివారల నిండ్లకంపి చనెఁ గృ
ష్ణుండు దా నగర్లోనికిన్.

గీ. చని యనుంగులతోడ భోజనము చేసి
తల్లిదండ్రులతోఁ గొంత తడవు దాను
బెండ్లియాడిన ముచ్చటల్ ప్రేమ నుడివి
వారియనుమతి నిద్రింపవలయు ననుచు.

ఉ. ఇంపు ఘటింప నొక్క[illegible] .
కిల్లు గనుంగొని యందు రాశి యా
సొంపు లెలుంగు వీనుల వి
నంబడఁ దా వినసల్లుచేరి నన్
గెంపుల చెక్కడంపుఁబని
గీల్కొను బంగరుపాన్పలెక్కి ని
ద్దంపు మెఱుంగుఁ జాయ జము
దాళి కరంబునఁ దల్చుమీటెనన్.

గీ. అమ్మ నేఁ డెల్లి యిదియెవ్వరనఁగ రాధ
యెటకుఁ బోవకు మింక నెవ్వఁడేలవచ్చు
నేను నీయుల్లుఁడ నటంచు నెనరు దోఁపఁ
బాదములమీఁద వ్రాలె గోపాలమూర్తి.

క. లేవయ్యా, దొడ్డవాఁడవు
నీవని తా నవలి కేఁగి నిన్నే మనుచుం
దీవింప? విందు మునుపే
గోవిందుఁడు నిత్యపెండ్లికొడు కనుమాటల్.

గీ. పాన్పుమీఁదను గూర్చుండి పలుకవయ్య,
మీరలును మహారాజు లైనారు గాన
నే నమస్కృతి సేసెద నిదిగొ యనుచు
మ్రొక్కి తాఁ బాన్పుదిగువ నింపుగ వసించి.

క. వెఱఁగుపడి యూరకుండెడు
హరిఁగూరిచి రాధ పలికె నానాఁటివలెన్
మురిపము గలదో లేదో
యరయుదమనివచ్చినావొ?యరయుము రాధన్.

ఉ. ఊరక యేమియుం బలుక
కుండెద వంచు దిగాలు నున్న, శ్రీం
గారగుణావతంస, నినుఁ
గన్గొని యూరకయుండ నేర నీ
నో; రొకపెండ్లికైనను న
నుం బిలిపించితే? చూడ నెవ్వరిన్

లేరని కాదు; నీ కెపుడు
నేనయ దాసనుగాన, వేడెదన్.

క. గోపాలక మాటాడక
కోపంబున నుండ నోచుకొంటిని మొదలన్
నాపగ్గె చెల్లఁబోవని
కోపము నేనే శమించుకొంటిని విభవన్.

ఉ. వేడుకకస్తనంచు రతి
వింతల నిన్ భ్రమియించఁ జూతునో,
మోడి సహింతునో భువన
మోహిని నేనని, కాక నేఁడు పెం
ప్లాడితినంచు బాధ్యతను
నాడుదునో, యిదియేమి? యెందును
గూడనిదాననై చనవు
గోరెద, నెవ్వతె నంచు దూరెదన్.

ఉ. మానుష మెంచినైనఁ, నొక
మంచితనానకునైన నీదుపు
ణ్యానికి మాటలాడెదవు;
నాతరమా నినుబల్మిఁ జేసి నే

స్తానకుఁ బిల్వ? నీఘనత
చాలదె బాధకుఁ; గాక కాఁకచే
నే నొకటాడ నేఁటి; కది
నీకు నసహ్యము దోఁచ నేటికే?

ఉ. దోసము కృష్ణ కృష్ణ! నిను
దూఱెద; నానొసలందు ధాత ముం
వ్రాసిన వ్రాఁతఁ గాదనుచు
వ్రాయఁగ నీతరమౌనె? నీవు దా
నేసట లేక నేరికని
నేడుక చేసెదు పైపైని నా
సాసల మాకు మేమె యి
నాఁటిన విన్నన నేర మున్నదే?

చ. ఎడనెడఁ జూడు మంటివో, క
యిబయి నెమ్మది నిల్పుమంటివో,
గడగడఁ గోరుమంటివో, వ
గం బడుమంటివో, వేఁగు మంటివో
బడలు మటుంటివో, యనుచి
పాల్పడుమంటివో, మొగ్గ సిగ్గులే

కడలుమటుంటివో, పొరలు

మంటివో, మూర్ఛ మునుంగు మంటివో?

ఉ. ఒక్కతె భ్రాంతిచేఁ బొరలి

నొక్కఁడు మోహ్యగఁ బూఁటకాఁపె? నే

నెక్కడిదాన; నీవు మును

వెక్కడినాఁడవు, నాకు నీకు నే

మక్కఱయున్న? నైన నొక

పాడుచీకటుల్కులు నేన నల్కడం

గ్రుక్కక; ఆయెఁ బోయె నవి

కొన్నిదినాలబుణానుబంధముల్.

మ. మన సూనాఁడు మహావినోదములఁ బ్రే

మ ల్మిజ భోగించుట

ల్వెను మీనాఁటికి నిద్ద అక్కరాకర్ణ

వేసాపటల్ వింతలై

కనుపించెన్ రుచియింప వేరచి కవు

ల్వర్ణింప లోకానకున్

వినసో; సంతియచాలు, మీఁదికథ లీ

పినుల్ విన్నలే విఁకన్.

ఉ. అందుకు బైసిమాలి యొక
యత్నము చేసుకయుంటినేని నా
యందుఁ బదాఱువేల కొఁక
యంశము రాదు భవత్కృపాగతుఁ మా
సందున భోజకన్యకయు,
సత్యయుఁ దృష్టి వహించినంగదా
యింపజనింపఁద రాధ యుఁక
నేటికిఁ? జాలవె జీవనాసికిన్.

మ. తుద నెట్లయ్యోదనో; యిదేటికి విర
క్తుల్ కేవు నీరుక్మిణీ
సుదతీరత్నము నీవు వాదుగొనఁ బ్రా
చుల్ చేరి నే సల్పఁదీ
ర్చెదనో యెవ్వరెఱుంగువారు మఱిసే
చిన్నారిప్రాఁబోండ్ల నే
ర్పొదవంగాఁ గయినేసి పెద్దతనమై
యుండంగ నేఁగందునో?

మ. సతమా పొత్తుల వన్నెకాఁడని గణిం
చక లేక యీగొల్లగు

జ్యోతలన్ జోరితి నేటిదాఁక నడిచెగా
వెన్ జూడు చేసెద; నా
గతి నీ పట్టపు రాండ్రకై యొకతె వ
ల్కన్ గారణం బున్న దే?
యతిమాత్రం, బెవ రేమిసేయ నిఁక; మ
స్వస్థుండనై తన్నిటన్.

సీ. వాలువెన్నలకుఁ బైఁబడెడునాఁటి కెకదా
మూఁపరించు యశోదమీఁది ప్రేమ
నేఁడు కత్తోడ ముద్దాడునాఁటి కెకదా
మిక్కిలి నందుని మీఁదిప్రేమ
ప్రేంకళ్లె దూడం మేపునాఁటి కెకదా
మేలపూ గొల్లలమీఁదిప్రేమ
అబ్బిన యిపిల మల్లాడునాఁటి కెకదా
మిక్కిలి మాజోంట్లమీఁదప్రేమ
తండ్రి వసుదేవుఁడయ్యెను, దల్లి యిపుడు
దేవకీదేవి యయ్యెను దేవరకును,
సఖులు నృపులైరి, రాజోంట్లు సకియలైరి
చాలదే, నేఁడు క్రొత్తసంసార మయ్యె.

మ. విమలాత్మా, యొకవిన్నపంబు విను మీ
    ప్రేషల్లెలోనున్న పా
పముగఁ మానితో నన్ను; నేను మెఱఁగే
    పాపాస ప్రేషల్లెపై
మమతల్ మానితో? యింత మాత్రము సహిం
    పఁ లేవె? పుణ్యాంబు నీ
కమహఁ గారణకార్యముల్ వెలిసె యా
    గ్యాయోగ్యము ల్చూచెదఁ.

ఉ. యేమిటికింటికేని విను
    మిక్కిడివారలు నాఁటనుండి నీ
నేమె త్యజించి నాకొఱకె
    యీడకు రావని యూహకొందుఁ; నా
నామి యెఱుంగు నీమనసు
    జన్మము దాల్చుట యాదిగాఁగ నా
నాముఖబాధలం బడితి
    పల్గురికిం బగ నైతి నీపగఁ.

చ. నిలువనిప్రేమదోసమున
    సంజిలి నీకు వచింప; నేరికిఁ

దెలుపుదు? నిందుకోసమె య
తిత్వార రమ్మని కమ్మ వంపుటల్
పొలుపుగ నేఁటితో మనసు
లోఁగల త్రొక్కుడులెల్లఁ దీఱె ని
ర్మల మిఁక మీఁద నేమయిన
మంచిదియుం చెడ సమ్మతించితిన్.

మ. ఇల నీమోహపుటూష్మనీవు వదివే
లేఁప్లన్ మహారాజులై
కలిమి న్బల్మిని జల్లనై బ్రతుకుఁ డిం
క న్ననున్న నాపేరునుం
దలఁపంబోకు; తలంప నేమిపని ? యూ
దైన్యంబు నీతోడనే
కలసెన్; బాసలు నీకు మేలొసఁగుఁ బో
కంజాతపత్త్రేక్షణా!

శా. దైవం బెంతకుఁ దెచ్చె? నీ వలఁపు లే
దా నాఁటికి న్నేఁటికిన్
ద్రోవల్ పుట్టెనె? నాఁటి దీగుణమె కా
దో నాఁటి కిమ్మేను లే

కావో లేక యిదేమి, యీసడత, లీ
కైలాట, లీమోసముల్?
నీ వాకృష్ణుఁడ వేను రాధనెకదా
నీరేజపత్రేక్షణా!

ఉ. ఇన్నిదినంబు లే బ్రతుక
నెంచుట యేమిటి కంటివేని యీ
కన్ను లిదేమొ నిన్నుఁదన
కాంక్షలు దీరఁగఁ జూడఁగోరె నే
నున్నది దేవుఁడుం దెలియ
కుండునె; దేవుఁడటంచు నీకు లే
కున్నను మాకుఁ బామరిక
మున్నది యున్నదినాలలోఁపలన్.

ఉ. వంచనమాలి గుట్టు మగ
వానికి నాఁడుది మించియియ్య రా
దంచువచింతు; రౌ, నది య
థార్థము; ముంగల నిన్ను నొక్క టా
సించినదానఁ గాన నది
చెప్పకతీరదు; నేనుబడ్డ పా

క్లొంచఁగ రాధ దయ్యాము సు
మీా, యిదియేమని చిత్తగించెదో!

సీ. ఒంటిగాఁ బవళింప నూరక నాగుండె
యదరంగ నెగవైచినట్లు తోఁచు
పడి లేచి తెగువతో నడవ నుంకించుచో
నదుముచుఁ బైఁబడినట్లు తోఁచు
కాదని యటులేవ గమకించ వడఁకుచు
నదియేమొ కుదియించినట్లు తోఁచు
గోరంత యుబుసుగాఁ గూర్చుండఁ దలఁచుచో
నట్టె సివంబాడునట్లు తోఁచు
నెత్తిపట్టినఁ గొంత వివేకముండు
జలధిలోఁబడ్డ నొకతెప్ప గలిగియుండు
నింతగా దిక్కు చెసలేని యిట్టివెతలు
నాతలనె పెట్టవలెనె యాధాత కైన.

మ. అడిగేవారో, మనంబు చల్లఁగను మా
టాడేటివారో, ప్రియం
పడఁగా నూఱటసేయువారో, దయతో
భాషించుచుఁ బుద్ధి చె

ల్పెడివారో, ధృతిలేక యేష్పుచు మొఱల్
వెట్టంగఁ గన్నీళ్లు దార్
దుడిచేవారా, యొకింత రేఁబగలు నా
తో వేఁగువారో కదర్ ?

చ. నలువురు నవ్వఁగా నడవి
సక్క శివంబయి పోల్కి యంతలో
మెలఁకువ నన్ను నే నుపశ
మించుక క్రుళ్లుచు లోన మించినన్
చెలివిడి చెచ్చుకొంచు నొక
దిట్టతనాన దినాలు ద్రోసి యి
ట్లలరితి నిన్నుఁజూచితి దు
రాసలు రోసితి మేలు సేసితిన్.

ఉ. ఓర్పున భాగ్య మింతె యని
యూరక నీ పలు కెంతుఁగాక, యా
నేర్పు లిఁకేమి? యల్లుఁడవు
నీవని నేనపు డెత్తి పెంచి యీ
డేర్పను, నేఁడు తాము రమి
యించి మదించను, తమ్ముఁ జూచి ని

ల్పెడివారో, ధృతిలేక యేడ్చుచు మొఱల్
వెట్టంగఁ గన్నీళ్లు దార్
దుడిచేవారో, యొకింత రేఁబగలు నా
తోఁ వేఁగువారో కదుఱా?

చ. నలువురు నవ్వఁగా నడవి
నక్క శివంబయి పొర్లి యంతలో
మెలఁకువ నన్ను నే నుసళ
మించుక క్రుళ్లుచు లోన మించినన్
వెలివిడి వెచ్చుకొంచు నొక
దిట్టతనాన దినాలు ద్రోసి యి
ట్లలరితి నిన్నుఁ జూచితి దు
రాసలు రోసితి మేలు సేసితిన్.

ఉ. ఓర్పున భాగ్య మింతె యని
యూరక నీ పలు కెంతుఁగాక, యా
నేర్పు లిఁకేమి? యల్లుఁడవు
నీవని నేనపు డెత్తి పెంచి యీ
డేర్పను, నేఁడు తాము రమి
యించి మదించను, తమ్ముఁ జూచి ని

బాష్పాలతో సిటుల్ కరంగి
యుంపంగ నే నదియేల యుంకిటన్.

శా. నామీఁదం దయయుంచుమయ్య యనుచున్
హాసాంచితో రాధికా
భామారత్నము చెక్కుఁ గేలనిడి గో
పాలుం గనుంగొంచు నీ
నామాధుర్యకలస్వనంబు దొలుకన్
దా వేఁడ్చు కన్నీళ్ల నున్
గోముంజన్నులు వొంగదోఁగి కడంకన్
లో వెక్కుచున్ స్రుక్కుచున్.

క. కాంతాళింబున రాధా
కాంతామణి రోదనంబు గావింప రమా
కాంతుండు గుణవంతుండు సర
కాంతకుఁ దెపు పలుకఁద్రిప్పు గని పని లేవన్.

క. ముకుఁజెలము లదరఁ నోఁపను
మొకమును కొంకవింతదోఁప మ్రొక్కుచు రాధా
ముకురాస్య రాకురా కని
మకరాంకునితండ్రి కనియె మఱిమఱి కినుకన్.

క. ఎనిమిదిరసములఁ గాంతల
నెనమంత్రను బెండ్లియాడి యిఁకనొకకొదవై
పెనుపొందు హాస్యరసమున
నను మచ్చిక సేయ నచ్చినాఁడవె కృష్ణా.

క. నాతోడిది నీకేటికి?
నాతో! డిఁకఁ బలుకరాకు; నాతోడిసఖుల్
నీతికిఁ జాతికి వెలిగాఁ
జూతురు నీతోడిచెలిమిఁ జూచిన నన్నున్.

క. కపటనుండి యూఁపవలసిన
యడియాసల మాటలెల్ల నాటకము, నాపై
నిపవలసిన నేరంబిదు;
గడిదేరితి నాఁటి రాధ గా దిఁక మొలఁగన్.

వ. అని నవతులపయింబాడము పేరీసునం బెఱుఁగు
కినుక చేత నొకటి సేయం జేతఁ గాని వితంబున,
లేని కలంకలు మనంబునం దొలంక తొందరపడి
యొదుసుం దోపగానని కొందలపాటున, వెనుక
ముందఱాలోచక యన్నియుం జేసి తటస్థునివిధం
బుననున్న సన్నిధానప్రియభావివియోగ ప్రా

పరాకల్పకందర్ప హేతిఘాతంబులనిలువునం గృశించి కలితకంకణవయనయగుచు నప్పటప్పటికిం దలంద్రిప్పుచుం దప్పక తనుంజూచునప్పుడం తింగనిపెట్టించియుంచుక విచారించి యిదియేమనియుం దలంపక తెగించి యున్నదియెందు నవనమ్మికలంబడు వారిమనంబు లాడంబడికలం గాని తేరదని వినయాదరసద్భాషణంబుల షోడశసహస్ర రాజకన్యకా మనోహరుం డిట్లనియె:

చ. పదంతికొ నేడు నీకుంగల
పాటివిచారము మాకు లేదె; నీ
యడుగుల వ్రాలి కొంత ప్రియ
మైనం దగ వివరింతు నన్నచోం
దోడింబడ నానంబెట్టితివి
ద్రోహముంజేసిన వాండంగాను నా
చిడిముడియెల్ల విన్నపము
చేసెద తాలిమి నూంకొనవలె.

మ. ముదు బాల్యంబున నీవు ప్రోవనితతిం.
మోదంబుతో నున్నచో

నను నానావిధగండముల్ బొందువుచు
న్నట్టి నీకటాక్షంబుచే
తనె కాదా కడతేరఁ గల్గె నది రా
ధా, నాఁడు బాలెంత యం
చును బంస్లించును గాలియంచుఁ దపులం
చుర్ మాయలం చందుమే.

క. వెనుకర్ దెలిసెను గంసుని
పనుపని యది తెలియలేక బలిమిని బిలువర్
జనవలసె మధుర కవ్వల
వినకుందువె మామ యచట విడివడినకథల్.

గీ. తల్లిదండ్రులయ్యుఁ దారు గాకుంషిరి
చెరలఁ దగిలి వెడలఁ కెరువు లేక
ననుఁ దలంచు దేవకిని వసుదేవుని
నరయవలదె దోషమా లతాంగి!

ఉ. కట్టిఁడి సేఁతలు న్వోతలుఁ
గంసునితోడనె తీరెనంచు నే
గుట్టు వహించి రాజ్యమున
కుర్ బరువానక వానితండ్రికిర్

బట్టముఁగట్టి యాకుదురు
సా టవ్వునంతకు నిల్చి యంత ను
న్నట్టులు నిన్నుఁ జూడవలె
నంచుఁ దలంచుక పైన మానెడన్.

మ. సకియా, కంసునిఁ జంపినానని జరా
సంధుండు రోసాన నూ
రక మామీఁదఁ జలంబుతో దిగి యహో
రాత్రంబులుగ్ గోటఁ జు
ట్టుక పోరాడు బలంబుతో మరలి పో
టుంబంట్లతో డుల్లు నా
బకళాటానకుఁ గాచె యీనడుమ నేఁ
బాద్వారి డాఁగుండితిన్.

క. ఈడకు వచ్చినఁ గాదని
యాడకునుం బోక మనము హాయిగ నెచటన్
కూడా నుండుద మోయని
వేడుకను సముద్రు నడిగి విను నేర్పుమెయిన్.

గీ. వనధినడుమను ద్వారకయనఁగ నొకటి
పురముఁ గల్పించి యందుఁ గా పురముగాఁగ

నచటి వారల దప్పించి యిచటి కేను
బైనమై యుంటి నింతలోఁ గలనె వినుము.

శా. వాఙ్మనస్స్వాంతమ్ము నునుచున్ బడంతి యనుచున్
వాక్రువ్వఁగా వింటిఁ దా
విష్ణంబుల్ శిశుపాలుఁ డుంచుకొని తీ
విన్ బైకొనం దోఁచి వి
ల్లాంఛ్లీ న్నాని జయించి రుక్మిణి నటుల్
కాంత్యాభిమానార్థకై
పెండ్లాడ న్వలసెన్ బయోజముఖిఁ, త
ప్పేమిన్ క్షమింపందగున్.

చ. ఇవతల నొక్క రాజు తన
యింటను రత్నము పోయెనంచు నా
యవుదల నిందమోపఁ బరి
హారముగా నొకజాడ వెంబడిన్
దవుల వనాంతరంబునను
దన్నని మెచ్చి పురాణఋషిపుం
గవుఁ డగు రామదాసు తన
కన్యను, రత్నము నిచ్చి బల్మిచేన్.

క. అపు డారత్నముఁ దొలుతటి
నృపునకు నిచ్చినఁ గుమారి నిచ్చె నతండుఁ
జపలాక్షి, నిందసోఁకిన
యపకీర్తికి వారిఁ బెండ్లియాడఁగవలసెన్.

గీ. కడమవారల నొక్కొక్క కారణముగ
నటు ప్రతిజ్ఞకునై పెండ్లి యాడవలసె
నొకటి సేయంగఁబోయిన నొకటివచ్చె
నెవ్వరైనను వివేకులై యెఱుఁగ వలయు.

మ. చిరలోకం బహువారు లేరొ, దయచే
సేవారలున్ లేరొ; కా
తరలంచు న్వెడిపించఁబోయిన నదే
తప్పె పదార్థాలు రా
తెరవ ల్గాంచెదఁ జుట్టుకోవలెనె యా
దీనత్వము జూడకే
మహమాటాడఁ దెగింతు రేమని వచిం
పఁ లేక పెండ్లాడితిన్.

క. ఈలాగున నొక్కొక్కతె
చీలలువలెఁ దగులుకొనఁగఁ జేసెను దైవం

జేలా యొడలెఱుఁగని శివ
మేలోకమునందుఁ గలదె యిది తగవగునే.

మ. ఇదిగో చేసినపాప మిూలుకులం
దేమాత్రము దప్పకన్
బదివేలేల, భవత్పదాంబులు దలం
పన్ యోగ్యుడం గాను సం
పదతో డీన్ బలగంబుతోఁ బ్రతిభతో
భాగ్యాంబుతో నున్న నీ
మది కింపౌనని నీ ప్రతిష్ఠయని కో
మ్మా, నమ్మితి న్నెమ్మదిన్.

ఉ. ఏ నటుగాక వారలప
యుం దయగల్గిన వాఁడనైన నో
మానిని, నిన్ను నింత బతి
మాలుదు నే సమయంబుఁ జూచి యే
మేనియుఁ బల్కఁ గాని దయ
నింతటిమోహము నీకుఁ గల్గినన్
మానక నాదు వెంబడిని
మచ్చిక రమ్మఁక యుక్తు లేటికిన్.

ఉ. అన్నియు విందు నాకుఁ గం
    యట్లి పదాబ్జవపాలు మేలు నే
కున్నవె? నీకుఁ దాఁ దెలియ
    దో? యవివేకపుఁ జేఁత నోప లే
కున్నది గాక నిన్ బలుక
    నోపద; లోకమువా రెఱుఁగరే
కన్నుల కల్కి నీవు దయ
    గ్గొంట నే దయగ్గొ యుంచుటల్.

క. అదియేల? చూఁడుదానికిఁ
గొడవ లిపక్కా రాదు గాన కొడవగు నేనే
యదయుఁడ మహాపరాధిని;
మదవతి, యింకనైన మోసి మానఁగరాదే!

మ. అని పల్కి న్నిసక్తేక రాధిక సరో
    జాక్షు న్నిరీక్షించి క్రొ
మ్మిన్నిట్లారుస్పుటించి గద్గదిక నే
    మే నాడఁగాఁబోయి నో
లని తానే తలవూఁచి యోఁచు, విను కృ
    ష్ణా, జాణవంచుండురే

మునుగల్పించుచు నేఁ డెఱింగితిమి సాం
పుల్ గుఱ్ఱు నీఱల్కు-లున్.

క. ఏవిధమున నీమోహపు
దేవుల కథ కథలుగాఁగఁ దెలిపెద వోఁగా
నేవినవలెనను ప్రజ్ఞకొ,
వేడుకొ కాక! యేమి నేరుపు చెపుమా!

క. ని న్నెవ్వ రడిగి రీకథ
లిన్నియు; నిన్నెవరు కోదవ లిటులాడిరి మా
కున్నవి దయలని యెవరను
కున్నా రీటక్కు-లేలనోయి, మహాత్మా!

చ. వెడవిలుకాని చేఁ దనువు
వేసరియున్నది యందుమీఁద నీ
యుడుకులమాట లేమిటికి
నూరక యాడెదు నేస్తనంచు ముక్క-
బిడుగునఁ బడ్డవారిఁ గొర
వింగొని చూఁడుదురే వితావితల్
విడువిడు చాలు నెంతయవి
వేకము నేఁ డిటులయ్యె వేడుకల్.

గీ. మమ్ము హాస్యంబు చేయుట మానవేని
నాడనలసినయటులెల్ల యాదుమీవు
నేను విని తాళలేనని హానమునను
జెవుల నంగుళములు చొన్పి శిరము వంచ.

చ. ఇది కదియంగవేళ యని
కృష్ణుడు పానుపు డిగ్గి రాధికా
మదవతిచెంతఁ జేరి నును
మై పులకించి చెమర్ప నొక్కకే
లుదుటునఁ దీసి కన్నుఁగవ
నొత్తుక యోచెలి, కోపమున్న మం
చిది చలమేల నొక్క చెవి
చే వినుము నాదొక విన్నపంబనన్.

క. ఒకచెవి మూసుక విన్నప
మొకచెవి వినుమన్న మాట కుల్లము గరఁగన్
ముకురాస్య, మాటలాడక
మొకమోరఁగఁ జేసి కొంత మోడి వహించెన్.

ఉ. ఇప్పటి కింత చాలునని
యేమియునుక్ బెనఁగాడఁబోక యా

కప్పురగంధిలో నని మోఁ
గంజదళాక్షుఁడు కౌఁగించి యో
యొప్పులకుప్ప, నీవిటుల
నుందువె యుండిన నుండు మోమటుం
ద్రిప్పఁగ నేమి చేసితిని
దిన్నఁగఁ గన్నులు విచ్చి చూడవే.

క. నీమనసే రాకయుండిన
మోహమైనన్ జూపరావె మోసంబటవే
మామిళ్ళ కాఙ్క్షయైతే
కామిని గ్రుక్కిళ్ళ కాఙ్క్ష గలదే యొందున్.

ఉ. కోమలి, లోకమందు నొక
కొన్నిదినాలకుఁ గావె కామినుల్
కాముకులందు నిల్పుదురు
కాంక్షలు పిన్నటనాఁటనుండియున్
గోమున నెత్తి పెంచితివి
కోరిక లుంచితి వాదరించితే
మేమొ యెఱుంగఁ జేసి తిపు
డెవ్వఁడ నింత నిరాకరింపఁగాన్ .

చ. ఎఱుఁగని వాని నన్నుఁ జెలి
మేటికిఁ జేసితి వానిఁ గొల్చి నీ
సరసము నీవిలాసమును
జాల మనంబున నాఁటె నిన్నుఁ గా
మఱవఁగఁ జాల నేల బతి
మాలఁగఁ జేసెద వేమి పోమ్మని
న్నరగడె నేపు కూసినఁ గృ
తార్థుడ నౌదుఁగదే, తలోదరీ!

మ. కలలోనైనను నీవె దైవమని నేఁ
గన్గొందు, నాడెందము
వెలియ న్నేర్తువు దైవయత్నమున నెం
తే నేరముల్ చేసినన్
జులుకం జేతురె బుద్ధిగా సహస్ర మం
చుం దద్దుకోరాదటే
చెలి, నీచిత్తము నాదుభాగ్య మిఁక నా
జపంబు రక్షింపవే.

చ. కనికరముంచవో నెనరు
గల్గినదానవు కావొ, భేద మీ

తనువులతోడ రాదనిన
దానవుగావా పడంతి, యింతలో
మనలను జూడలేక నడ
మంత్రపువారు గుబారు చేసి గొ
బ్బున నినువంటిదా నికెగ
పోఁతెలె నాతలఁ గాకయుండగన్.

చ. చిలుకలకొల్కి, నీసొబగు
చిన్నెల సీనును దేటపల్కులన్
వెలసె మనంబు కాంతి, రతి
వేడుకలన్ జవిచూపితేనియున్
పలుకుబ కేమి నాతనువు
పావనమాటది మీఁది మాట కు
న్మలుచనగాను నీమనసు
ముచ్చట దీర్చెద నోతలోదరీ!

క. అహమికను నన్నుదూఱిన
తహతహచే నీకు నపుడు దయలేదనుచున్
బహువిధముల నెదురాడితి
నహహా, నాయంత వెతల నందవె నీవున్.

ఉ. కంతుని గంతు లెంచి కను
    గంటికిఁ బుట్టెడు నీరునించి యం
తంతకుఁ దల్లడించి ధృతి
    యల్లలనాడఁగ నిచ్చగించి నా
స్వాంతములన్ దలంచి చెలు
    లాడుకొనన్ దలవాంచి వాంఛచే
నెంత విరాళిఁ బొందితివో
    యెంత కృశించితివో తలోదరీ!

చ. చెలి, నినుఁ బాసి యే నిమురఁ
    జెందమి చెప్పలేనుగుఁ గాకచేఁ
దలఁగుట మే నెఱుంగు రుచి
    దప్పుట జిహ్వ యెఱుంగు నోంటినే
నిలుచుట నీ వెఱుంగుదువు
    నిన్నును నీమదిలోని చింతయున్
దలఁచిన గుండెలో దిగులు
    దైవమెఱుంగును ప్రాణనాయికా!

చ. నలువురి మాటలన్ వినక
    నాతలిదండ్రుల నమ్మఁ బోక పె

ద్దలు తెలుపంగ నూఁకొనక
దైవమునుం గొలువంగలేక నీ
చెలిమియె భుక్తి ముక్తి యని
చేరితి నింతట దానవాట నేఁ
దెలియక మోసపోతి పర
దేశిని జేసితి వంగనామణీ!

క. ఈవగనీ వగకు వగకును
భావనతో నూఱునాఱుపద్యములు చెలీ!
ఈవఱకును రచియించిరి;
నీవేగతి; లోకమెల్ల నినుఁ గొనియాడున్.

ఉ. జిత్తులకత్తె లిచ్ఛకముఁ
జేయుచుఁ బైపయి నాసఁజేయ నే
నత్తటి నన్నియు న్నమిచి
యంతటఁ జొచ్చితి బొంకనేల? వా
దత్రిక నన్ను నేవగను
దండన చేసినఁ జేయఁజెల్లు నీ
చిత్తము నాదుభాగ్య మిఁకఁ
జెప్పెడిదేమి, కురంగలోచనా!

ఉ. ద్రోహి నటంచు నేఁడుగద
 తోఁచెను ముందటి చిన్ననాఁటి నా
మోహముఁ జూచియైన నను
 ముందుగఁ గైకొనరావె, కోపమే
లే హరిణాక్షి, నా నడత
 యేగతి నుండిన నుండెఁగాక యీ
దేహము నీ యధీన; మిఁక
 యొంచియుఁ గౌఁగిటఁ జేర్పరాదటే.

సీ. ననచూపక ఫలించు పనసభూజముభంగి
 సుదతిరో, మును మేలు చూపినావు
పూచినంతనె కాచి పొల్చు మామిడిమ్రాఁకు
 నెలఁతరో, మది దయ నిలిపినావు
పూచి పిమ్మట రాలిపోవు పాటలిభంగిఁ
 దరుణిరో, కలప్రేమ దాఁచినావు
పూచి కాచి ఫలించు భూకల్పకమురీతి
 మగువరో, యిఁకనైన మనుపఁగలవు
నీకు నీయంతఁ దోఁచని నెనరు ప్రేమ
వచన రచనలఁ దెలుప నెవ్వారికి వశము?

నిన్నువంటిది నను వంటి నెనరువాని
చలము నేయుట యిది పూర్వ ఫలముగాదె.

క. కలికీ, పలుకవె చిలుకల
కొలికీ, దయఁజూడరాదె, కోపం బేలే?
యలికీరంబుల కిదిగో
యళికెను నాడెంద, మొందు కలయించదవే!

గీ. ఆనవిడు నీదు పదములపైన వ్రాలి
వేఁడుకొనియెద దయపుట్ట విన్నవించి
పడఁతి, కాదేని హృదయతాపంబు దీఱ
నాన విడువుము నీయధరామృతంబు.

గీ. రమణి. దాసరితప్పు దండమునఁబోవు
నందు రందుకు నోఁచనై తిందువదన!
యింక దయనేలునో భాగ్యమింతో యనుచుఁ
దొలుతఁ దనుఁ దోడితెచ్చినచిలుకఁ జూచి.

చ. కడకడ యుండెదేమె చిలు
కా, ముసు నమ్మిక లీ వొసంగఁగాఁ
దొడిఁబడి నమ్మి వచ్చితిని
దోఁచినరీతిని విన్నవించితిఁ

గడపట నేమిలేక నను
గంతుని చేతికి నప్పగించె మీ
పడతుక; యేను గాదనుచుఁ
బట్టావు నీవును జేరివచ్చినన్.

క. చిలుకలకొలికికిఁ గలికికి
నలుకట, పలుకదట, చలముబట నీవైనన్,
గులుకువగఁగులుకుకపురపుఁ
బలుకులొలుకవలపుఁజిలుకఁబలుకవె చిలుకా!

గీ. మరుఁడుగురిగాఁగ నేనాడు మాటయొకటి
చెవులఁజొరదాయెఁ జిలుక యీ చెలికి నేఁడు
సూఁదిద్రిప్పంగ దారంబు సూటివడునె
భామ యిటులున్న మగవాఁడికేమి సేయు.

వ. అనిన రాధికాపధూతిలకంబు తన పెంపుడు
చిలుకం జేర్కొని యిట్లనియె.

క. నే నెవ్వతెఁ దను మనుపను;
తా నెవ్వఁడు నన్ను వేఁడ; తనకు న్నాకున్
బూనికి నేసంబంధము
వైనంబున నడుగ నేరవా యని కదుమన్.

వ. అనినc జిలుక యిట్లనియె.

క. నీ వనcగా నతc డనcగా
నే వినcగాc జాల నెల్ల నీతులు గీతుల్ ?
నీ వెఱుcగు దాతc డెఱుcగును
పోవేయనcగృష్ణుcడలుక మొగమునcదోలుకన్.

గీ. ఇంత పనిలేనిపనికి నేనేల పెనcగ
ననుచు మెడ జారుసిగc గేల నదుముకొనుచు
తగటు దుప్పటి వల్లెవాటుగ ఘటించి
లేచి తలయూcచి రాధను జూచి పలికె.

ఉ. తీరని మోహతాపమున
దీనతచే బతిమాలి చూచి వే
సారితి నింక నీచెలిమి చా
లును నీవెత నీకు ముద్దె; నే
నూరికిc బోయెదం గరుణ
యుంచవె; యించుక యూఱడించcగా
నేరకపోతినంచు చెలి
నీవెతలంచెద వింక మీcదటన్.

చ. సొలయక యెన్ని దేశములు
    చూచితి, నెందఱితోడ నేస్తముల్
సలిపితి, నెంత ముచ్చటకుఁ
    జాలితి, నెవ్వియు నీవ్వామె నీ
నిలుకడమాట నినెనరు
    నీరసికత్వముఁ జాల నమ్మితిఁ
జెలి, కలనైన నన్ను మఱ
    చేవుసుమీ యెవ రెన్ని చెప్పినన్.

చ. కులుకుమిటారి, నీవు నెల
    కొన్న పురంబును నీగృహంబు నీ
చెలులును నీవు నీసొలపుఁ
    జిన్నెలు నీవగలున్ మనంబునన్
నెలకొన గుండె జల్లుమను
    నేఁటికిఁ దీరని వైనమాయె ముం
గల నినుఁ జూడనౌనె! అపుఁ
    గా పరదేసుల కేడ వేడుకల్?

ఉ. ఒక్కొకనాఁటి నీనడత
    లుల్లమునం దలపోసి పోసి యే

చిక్కులకైన నోర్చి దరిఁ
జేరుదుఁగా యని చాల నమ్మితిన్
మక్కువ లేనివోట బతి
మాలిన నామది కందుఁ గాక నా
తక్కువ నేస్తమైన మితి
దప్పిన వేసట గాదె యోరికిన్.

చ. పకపక నవ్వుచుం జెలఁగి
పైకొనుచున్ రతులం బెనంగి పా
యక మన మున్న పొంద మిసు
మంతయు నే మఱవంగఁజాల నెం
దుకుఁ బలుమాటలీ తనువు
తో నెఱనమ్మిన నెమ్మనంబుతో
నిఁక నొకకాంతతోఁ జెలిమి
యేమని సేతు సరోరుహాననా!

చ. పలుమరు నీకుఁగాఁ బడిన
పాటులు నీమన సే యెఱుంగు నీ
చలమును నీతృణీకరము
జవ్వని, నామన సే యెఱుంగు నే

వల ననువంటిమేలుగల
    వాని గడించు కొనంగలావె? యు
వ్వాల నను దూఱవద్దు, చెలి
    వా యిఁక సీమకు ముద్దుకోమలీ!

మ. పఱుకై నచ్చితిఁగాని నేరములు నా
    పై నుంచి కోపించుచోఁ
నెఱుఁగ న్నామది చల్లఁ జేసితివి యిం
    కిల్లేల? యూరేల? యు
వ్వాస నాకేల? ఋణానుబంధములు గా
    వా యన్నియు న్నేఁటితోఁ
సరి గాఁబోలును బోయివచ్చెదఁ గటా
    క్షం బుంచుమియా రాధికా!

మ. అనిపల్క న్విని కల్కి యొంతపలు కా
    హా యింత గానేరవుం
డిఁక లోఁ జేతుప రాచకన్నియల; నెం
    తేఁజాలు తెల్పెల్ల పా
లనుచు న్నమ్మెడు గొల్లవారికడ; నా
    యందూరకే మన్నిటం

గనినా మిన్నియు నీకటాక్షముచనే
కాదా ప్రవర్తించుటల్.

మ. నను నేఁ డెవ్వాతె నంచుఁ జూచితివొ కృ
ష్ణా, నిన్నుఁ బోకుండ బ
ర్థించెద నంచు నెంచితివొ యా
లే యింతకుం జాలవే
యనుఁగుంబోటులు యింట్లకేఁగెదవొ భా
గ్యం బాయెఁ బోపొమ్ము ప్రే
మను నేఁ జూచెద నిన్ను నన్నుఁ బెగడే
మాయూరి పూఁబోఁడులౌ.

చ. తెగువల నమ్మలక్కలును ప
తివ్రతలై నను దూఱువారు నే
నొగి విను దాన నీవు కడ
నుండెడివాఁడవె నీవు వారునుం
దగవున మెచ్చఁజేతు రది
దప్పినఁ జూచెద వీటికెల్ల నుం
బోఁగడిక దెత్తుఁగాదె యెటు
పోయెదు నిన్నొడ నెన్నిభంగులౌ.

చ. అనుచు నిరాన లేచి వన
జాక్షుని దుప్పటి కొంగుఁబట్టి గొ
బ్బున నెటు పారిపోయెదవు
పోదువుగాక యని శయ్యమీఁదికిన్
బెనఁగుచు దియ్య నొయ్యనఁ ద
మిన్ బిగి కౌఁగిటిలోఁ గదించి రా
ధనుఁ గరఁగించె శౌరి తను
తాపము దీరఁగఁ గోర్కె మీరఁగన్.

చ. చలమును గోప మీరసము
జవ్వని కేడకు డాఁగిపోయెనో
తెలియదు కొంతసేపు తన
దేహము దాఁ దెలియంగ లేక మై
పులకల నప్పటప్పటికిఁ
బొంగుచు నిక్కు-వ లంట సోలుచున్
బలుకక యూరకుండె నట
మాధవుకౌఁగిట రాధ వేడుకన్.

క. చెలువయట రాధ, కృష్ణుఁడు
చెలువుండట, పిన్ననాఁటి చెలిమట, యెడలై

కలసినవారట వారల
మెలఁకువలకుఁ దమికి మట్టుమేరలు గలవే?

మ. కొమరుం బ్రాయపుఁ జిన్నిచన్నుఁగవ ము
క్కుల్ నొక్కి కోరాడి కం
ఠమునన్ గేలు గదించి చెక్కులు గో
టన్ మీటి నెమ్మోము లేఁ
జెమటల్ గ్రాలఁగఁ గౌఁగిలించి బడలిం
చన్ జొక్కి తానెంతయున్
దమి రాధా మధురాధరాధరసుధా
ధారల్ చవిం గ్రోలుచున్.

ఉ. చిక్కితివంచు రాధ వగ
చే హారికంఠముఁ గౌఁగిలించి తా
నక్కున వ్రాలి చూడకుమ
టంచును నించుక మోడి సేయుచుం
జక్కెరమోవి యాని నిలఁ
బాలిక కన్నరమోడ్చి సోలుచుం
*బుక్కిట వీడెమందుకొని
ముద్దుల నొద్దికమాట లాడుచున్.

*గ్రక్కునగబ్బిగుబ్బలటు గట్టిగఁ బట్టఁగఁ దాళుమంచుఁదాన్.

నిరోష్ఠ్యమత్తేభవృత్తము.—

గిలిగింత న్నగి కాంత కాంతుకృత సం
   కేతజ్ఞయై యిచ్ఛఁ జం
చలతాటంకరథాంగగండయుగయై
   సంత్యక్తచేలాంతయై
చెలరేగెన్ కఠిన స్తనాద్రిసఖ ని
   శ్శేషాధర గ్రాహయై
గళనాదాంగదఘంటికా కలకలా
   క్రాంతాంగజేచ్ఛా రతిన్.

చ. గళరవ ముప్పతిల్లి బిగి
   కౌఁగిటఁ జన్నులు పిక్కటిల్లి సం
వెలరవ మావహిల్లి గడి
   దేరిసవార్తలు గ్రక్కతిల్లి మే
ఖలరొద నివ్వటిల్లఁ జెలి
   కన్గొన లించుక సొమ్మసిల్లి నూ
ర్పులవడి సంఘటిల్లఁ దమిఁ
   బొంగి లతాంగి చెలంగి పైకొనెన్.

ఉ. అంత రతాంతమందుఁ గమ
   లాక్షుఁడు రాధికమోముఁ జూచి యీ

వింతలి కేమిఁ జెప్ప నొక
వేడుకలోఁ బదివేలువేషముల్ బం
తంత ఘటించి చేర్చితి వ
హా, నెఱయోగపు గావె నీవు నీ
వింతకు నేరకున్న ప్రేమ
యింతువె కృష్ణుని లోకు లెన్నఁగన్.

ఉ. కోమలి, యెంత నీవు నయి
కొన్నను మున్నొక లేవియెమ్మెతో
నామికచేత నీరత్నుల
యంద మెఱుంగక యొల్లనంటి నేఁ
డేమని విన్నవింతుఁ దను
వెల్లను భావసమూహ మె నీయునా
జేమిటఁ దీర్చుకొందు నొల
యించితి వన్నిట నన్ను నేడుకన్.

క. అన విని రాధిక కృష్ణునిఁ
గనుఁగొని యానన్వ్యమోము కళగల చెక్కుల్
నును మోవియుఁ దెలిగన్నులు
గొనబునఁబలుమారుముద్దుగొనుచున్న గుచుగ్.

ఉ. తేరని నిద్రమంపు దగ
దీరని యూర్పుల పెంపు వచ్చి కా
టారని మోవి కెంపు చెమ
టారని చెక్కు బసొంపు జారియుం
జారని పైటలోని బిగి
చన్నుల క్రొన్నెలవంకగుంపు చె
న్నార నొయారముల్ గులుక
వచ్చెలి యప్పుడక్కిల్లు వెన్వెడన్.

క. ఆనపత దానెఱుంగని
దానివలెనె యాయశోద తా నుండుటయుం
దానె తను సందుఁ డడిగినఁ
బోసి మన కేమటంచు పొలఁతుక నవ్వెన్.

క. ఈరీతిఁ గొన్నిదినములు
కూరిమితో రాధవగలకున్ లోనై యా
శౌరి వసియించి యొక నాఁ
డా రమణిన్ సమ్మతిల్ల నాడి సుముఖుఁడై.

గీ. పదిదినంబుల మళ్లి వచ్చెద నటంచుఁ
దల్లిదండ్రుల కెఱిఁగించి గొల్ల చెలులఁ

పూర్వసఖులనుఁ బ్రియమున బుజ్జగించి
రాధతోఁ గూడ వెడలె సమ్మోదభరమున.

చ. రథముపయిన్ వసించి హరి
రాజులకు రాజులు నేస్తకాండ్రు వే
విభవముల నింపగా నమితో
వేగములతో నతి వైభవంబులతో
నధికవిభూతిమైఁ జెలఁచి
నంతట ద్వారక కేఁగుదెంచె దన్
రథగజ వాజి వీరభట
రాజు లెదుర్కొనఁగా మహోన్నతిన్.

ఉ. ఇల్లు పురంబుఁ జేసినది
నేమని చెప్పగఁ దోరణాల మే
ల్కట్లను మంచులన్ బురుజు
లన్ పిడితేసులఁ జప్పరాల మే
ల్కట్ల జనాళివాసనలు
ఘుమ్మన బంగరు మేడలన్ జెలుల్
పొట్లముగా వసంతములు
పోయగ సబ్బరమయ్యె రాధకున్.

మ. హరిఁజూడక బురమొల్లి సుల్లమనె నా
హా రాధ మాకేశవా
పురమై వచ్చెనటంచు రుక్మిణి మొదల్
ప్రాణేశుల్ చింతింపనం
దఱిలోనన్ హరి పూర్వవృత్తము ప్రసి
ద్ధాంతంబులుగఁ జేయ నే
ర్పరి గానన్ సరిమిద్దెలో నిజం బూ
ర్వస్నేహమును రాధికన్.

మ. పయిపై రుక్మిణి సత్యభామలు సమం
సంగాఁ బడార్వేలు క
న్నియలం గూడఁగ నిర్వికారహృదయన్
నిర్మోహియై నిర్జితేం
ద్రియుఁ డౌనన్నను దాల్చియుండె నెనుకన్
నిక్కంబుగా రాధపై
దయవాఁడై యపుడున్న చిన్నెలు స్వ
భా తత్త్వంబు లయ్యెం గదన్.

ఉ. చేకొని మంత్రిబలం దడియు
సీమ విచక్షణ కార్యఖడ్గము

లీలఁ గుమాళ్లయం దిడియె
విద్యలఁ బెద్దతనంబులం గుల
శ్రీకులకంబులు దిడియెఁ
చన్నెలఁ గేమన రాధతోఁడిదే
లోకము గాఁగ నుండె నిఁక
లోకులు కాముకుఁడంచు నెంచరే.

ఉ. కన విశోకశక్యనల
నైవడీ బాధయు మాధవుం డిటుల్
దవ్వుగ యుండఁగాఁ దమరు
తాళక రుక్మిణి సత్యభామ జాం
బవతియు మిత్రవిందయును
భద్ర సుదంత కళింవజాతయున్
రవరన నాడుకొంచు నొక
రాత్రిరి రుక్మిణాయింటి కేఁగిరన్.

ఉ. సశంతుక మ్రొక్కి వారికి స
కర్యాలు నేయుచుఁ దాను వారు నొ
క్కెడ వసియించి నెచ్చెలుల
నెవ్వరి నుండఁగనీక యోచనల్

నడపుచు నీసునం బెగువ
సల్లురు నాలుగుమాట లాడఁగా
నుడుకుచు సత్యభామ విన
యోక్తుల నక్కిలిఁ జూచి యిట్లనున్

గీ. నన్ను గయ్యాళియాయె నీకన్న లెల్లఁ
వెలియుదీను మక్క, పట్టంపుదేవి వీవు
పేర్మి నీతోటి సాటిగాఁ బేరఁగాఁ గొని
దాసవారాశి పారిజాతంబు కొంటిను.

ఉ. ఎన్నఁటికైన వానిగన
వెన్నతె మ్మునె కృష్ణకృష్ణ మా
యున్నదినాలలోన దయ
యుంచి వానివిధానఁ బెద్దకున్
బిన్నకుఁ దోఁచినట్లు నడ
పించును చేసెడి బాసలంటిమా
యెన్నఁదరంబుగాదు నిజ
మించుక లేదు తలంచిచూచినన్.

ఉ. ఇంచుక రాధ సుద్దమును
పే విని వేఁడితి వారువీసుఁ గ

ల్పించి రటంచు నో రదిమి
లేదని బల్కెను నాఁడు నాఁడె యి
ట్లెంచుక యొద్దికైన మన
మింతకురా నవపింతుమే యికం
గొంచెములోన దానిపయిఁ
గూరిమిదప్పనె తప్పె యోచనల్.

వ. అనిన జాంబవతి సత్యభామ కిట్లనియె:

ఉ. ఎందుకుఁ దప్పె యోచనలు
కృష్ణుని మాయలెఱింగి వానిపై
నింద ఘటింప నేమగును
నేఁ దప్పుఁ గాదను వారు లేరుగా
కందఱుఁ గారటంచు నిపు
డక్కట రాధిక మేలుగల్గెనా
యందె రమింపఁగావలె న
హర్నిశమును బనియేమి యేఁరికిన్.

వ. అనిన మిత్రవింద జాంబవతితో నిట్లనియె.

ఉ. ఎవ్వరికిం బనేమియని
యేటికిఁబల్కెదఁగ నాఁడు నీవు నే

మెవ్వరమంచు నుల్కితి మొ
కించుక నేర్పుల నాటపాటల
నెవ్వరి లోను జేయవలె
నాథునిఁ గాక మఱేమి; రచ్చలన్
రవ్వలఁ బెట్టినన్ మనసు
రంజిల నేర్చునె యెట్టివారికిన్.

వ. అనిన భద్ర మిత్రవిందతో నిట్లనియె.

ఉ. రచ్చల రవ్వలన్ మనసు
రంజిలదంటివి రాధ కేమిట
న్వచ్చెఁ బ్రతిష్ఠ నేఁడు మగ
వా, మనమందఱ మొక్కమాటగా
కచ్చగ శౌరితోడఁ బలు
కన్వలె రాధకు మాకుఁ గూడనే
నిచ్చలు మేము గావలెనొ
నొకతె గావలెనో యటంచు చీఁకన్.

వ. అనిన సుదంత భద్రతో నిట్లనియె.

చ. అదివలె మేముగావలె నో
యంచు చపుడాడిన దాని మానునే

అదివలె మీరుఁ గావలె సటం
చను; నింకొక నేర్పు తెల్పెదన్
పదటము లేక సందఱము
పద్మదళాక్షుని త్రోవఁ బోక నేఁ
డిదిమొదలున్ తెగించిన న
హిన్ సమయంబు ఘటింపఁగావలెన్.

వ. అనినఁ గాళింది సుదంతతో నిట్లనియె.

చ. సమయము సేయఁ గృష్ణునికి
సాగకపోయిన దేమి యందుచే
సమరగ రాధ కేమికొగ
వయ్యెను బిన్నటనాఁటనుండియున్
దమి తల కెక్కియున్న దయ
దప్పనె నేర్చితిమేని మందు మం
త్రములను బూని వానికిని
దానికి భేదము సేయఁగాఁ దగున్

వ. అనిన లక్షణ కాళిందితో నిట్లనియె:

ఉ. మందును మంత్రమం చనెదు
మంత్రము లిప్పుడు పాటి దప్పె నీ

యందఱు మెచ్చ నే నొక యు
పాయము చెప్పెద రాధ చెంతకే
పొందుగఁ జెప్పి పంపుదము
'బుద్ధిని బెద్దవు నీవు నీకు మా
కెందుకు వాదు నీవె ఘన
మెంచుక దిట్టము సేయు' మంచొగిన్.

వ. అనిన రుక్మిణీరమణీశిరోమణి యుక్కామినీ
మణులం గనుంగొని నవ్వుచు నిట్లనియె:

ఉ. నిందలు సేయ నెందుకుఁ దృ
ణీకర మెందుకు పీడనాడఁగా
నెందుకుఁ గాదు కూడదన
నెందుకుఁ బల్కుక మోడి సేయఁగా
నెందుకు మంకుమంత్ర మన
నెందుకు వైన్యముఁ బొంది యాడఁగా
నెందుకు నే వచింతు నొక
యుక్కువ యుంచుక వింటి రేనియున్.

మ. మన భోగంబుల నేమి తక్కువలుగా
మన్నించె నేవేళకై

నను మాటాడఁడో, బుజ్జగింపఁడో, రతిఁ
మత్తాడుచుం దృప్తిగాఁ
ననువుల్ సౌఖ్యము లొందఁజేయఁడో మహో
త్సాహార్యచిత్తంబునన్
మనలోనఁ మఱవారె యీర్ష్యలు సహిం
పఁ వారిచే న్నేరముల్.

సీ. ఒకరిసొమ్మేమి వేఱొక్కరిసొమ్మేమి
చక్కనికబ్బనే చిక్కఁదనము
లోకులు గననేమి తాగనుంగొననేమి
వెన్నెలపూవునే విన్నదనము
అంత గైకొననేమి యింత గైకొననేమి
యమ్మతొని కబ్బనే యల్పతనము
చెంత నుంచిననేమి చేత నుంచిననేమి
విరిబంతికబ్బనే వెగటుఁదనము
యొకతె చవిగొన్న లేదె మోవికిని దీపి
నలుగురును జూడ లేదె నవ్వులకుఁ దెలివి
మాట యొకమాటు విన్నఁ జాల్మనకతృప్తి
శౌరికడ నుండిసను లేదె సంతసంబు.

మ. వినుఁడే వేళను కృష్ణుఁ డేనగరికిన్
వేంచేసెఁ దా నెవ్వరిం
గనిమాటాడెను వార లప్పటికిఁ బ
ల్కన్ మేర సర్వజ్ఞుఁ డా
ఘనుఁ డేలా పొరపొచ్చెముల్ సడుపు నిం
కన్ మానుఁ డీవార్త లా
య్యన నారాధ యొకింత విన్న మన కే
యాఁ జిన్నపో హీనముల్.

చ. అన నిది యుక్తమంచు నపు
డందఱు సమ్మతిఁ జేసికొంచు మె
ల్లనఁ దమయిండ్ల కేఁగి యొక
లాగున నుండిరి వారిమాట లా
యొనరికఁ బొంచు లుండి విని
యొద్దికఁ బెంపుడుచిల్క గ్రక్కునన్
దనకు వచింప రాధ విని
తా నది కృష్ణునితోడఁ దెల్పినన్.

క. ఈనుడును లిపుడు వింటివె
యానడుమన్ నీవు చిలుక నంపిననాఁడే

నానావిధముల నడిగిరి
మానవతీ, నీదు గాక మహి నల్పంబే.

వ. అనిన గోపాలచక్రవర్తికి రాధావధూతిలకంబతి
ముదంబున నిట్లనియె.

సీ. పల్లెతావులనున్న గొల్లదానిని దెచ్చి
నవనిధానములందు నిలిపినావు
చెలఁగి రాధామాధవుల చెల్మి పాయక
బిరుదైన కీర్తిఁ గల్పించినావు
ప్రౌఢలైన కిరీటపతుల కన్నెలమాని
ననుఁ బ్రాణపదముగా నడపినావు
సకలవిద్యారహస్యము లెఱుంగఁగ జేసి
దేహ మానంద మొందించినావు
నేఁడు నాపాలిదైవంబు నీవె యనినఁ
జాల దీమాట నామహోత్సాహమునకు
నెంతసంతోషపడెదనో యెఱుక లేదె?
మొదటి కిటుచేయు సర్వజ్ఞమూర్తివీవు.

గీ. ఒకటఁ గొఱఁతయు లేక నే నున్నదాన
నైన నావిన్నపం బిపు డాదరింపు

నీదుపట్టపుదేవుల నెఱుఁగలసి
బంతి భుజియింపవలె రేపు సంతసమున.

చ. అని మఱునాఁడు నారికిఁ బ్రి
యంబుగ సమ్మతిగాఁగ శౌరిచే
తనె పిలిపించి వారలును
దానును కృష్ణునిఁగూడి బంతులై
యనుపుగఁ బాచభక్ష్య పర
మాన్నములన్ జపు లెంచికొంచు భో
జన మొనరించి కౌతకర
సారసులై ముదమంది రంతటన్.

మ. నవరత్నస్థగితంపు సొమ్ములను నా
నాగంధపుష్పాదుల
న్నవరంగత్కనకాంబరంబులను గాం
త ల్వింతలై చేరి చు
ట్లవసింపంగొలువున్న మాధవుని దం
డన్నిల్చి యారాధన మ
ర్మ్యావర్తోఁ బల్కెను గప్పురంపు నును బ
ల్కుల్ దక్కులం జొక్కఁగన్.

మ. పొలుపా రుక్మిణి సత్యభామలకు నీ
ప్రాంభోండ్లకాయున్న క
న్యలకు న్నేఁ జెలికత్తెనై శెలిపెదన్
వీరల్ భవత్ప్రీతికై
కలహంబుండఁగ నేల? సంచి వచసల్
గల్పించి గోపాల,ప
రలరన్ దిట్టము నేన చేసెదను మ
ర్యాదన్ రగన్ నీయెడన్.

చ. ఒకనెల కొక్కమేర వినుఁ
మున్నదినంబులలోఁ బదాఱువే
లకును బదాఱునాళ్లు లవ
లిక్మరి మూఁడుదినాలు నార్గు రొ
క్కొకటిని లక్షణాదులకు
నొప్పగు సత్యకు రెండునాళ్లు నం
దకు నొకటెచ్చు రుక్మిణికిఁ
దోఁచినచో దయ న్మందు వెల్తికిన్.

గీ. అనుచు నోయక్కలార, నే సంటిననుచుఁ
గోపి ముచకుఁ డీమేర కొడువ గాదు

సమ్మతిలుండంచు సతుల మొగమ్ముం జూచి
హరికి మొదలుగ రాధ యందఱకు మ్రొక్క.

క. కూర్చుండుమనుచు రాధను
గూర్చి పడంతుకలు మెచ్చుకొంచును బ్రియముం
గూర్చి పలుకంగం గృష్ణుండుం
గూర్చుండంగ నిడియె నవ్వుకొనుచుం జెంతన్.

ఉ. అంతట వారివారిని గృ
హాంబులకున్ సెల విచ్చి రాధికా
కాంతను గృష్ణదేవుండు త
గం గరగించి చెంగి వింతకున్
వింతలుగాం దమిన్ వరుస
వెంబడి సందడిచొచ్చికేగి యు
త్యంత విలాసమార్గముల
దక్షిణనాయకుండు ఁ పమ్యొనున్నతిన్.

క. విను రాధామాధవకృతి
మనమున నిడి వినినం జదివి మఱి వ్రాసిన మె
చ్చిన యాధన్యాత్ములకున్
వనజాక్షుం డొసంగు సకలవైభవము దయన్.

నిగమవిధివిహారా, నిత్యసౌఖ్యానుసారా!
నగరభవగభీరా, చారుశృంగారవీరా!

గద్య. ఇది శ్రీమద్వేణుగోపాల వరప్రసాదలబ్ధ
శృంగార కవిత్వ వైభవ వెలిదిండ్ల తిరు
వేంగళార్యపుత్రసూనుభవ విద్వజ్జనవిధేయ
వేంకటపతినామధేయ ప్రణీతంబైన
రాధామాధవ సంవాదం బను
మహాప్రబంధమునందు
సర్వంబును




ఏకాశ్వాసము.

---

రాధామాధవ సంవాదము
సంపూర్ణము

---